# తెలుగు వాచకం

## నాలుగో తరగతి

రచయితలు :
డా. దహగాం సాంబమూర్తి
తెలుగు ఉపన్యాసకులు, ప్రభుత్వ విద్యా కళాశాల, ఓరుగల్లు.
శ్రీమతి ఎ. సుశీలాదేవి
తెలుగు పండితులు, జిల్లా ప్రజాపరిషత్తు సెకండరీ పాఠశాల, కావలి, నెల్లూరు జిల్లా.
సంపాదకుడు :
డా. అంతటి నరసింహం
సుభాషితరత్నావళి సంపాదకుడు :
డా. వి.వి.యల్. నరసింహారావు
ప్రధాన సంపాదక మండలి :
ఆచార్య కె. కె. రంగనాథాచార్యులు, అధ్యక్షులు
ఆచార్య కేతు విశ్వనాథరెడ్డి, సభ్యులు
డా. వి. వి. యల్. నరసింహారావు, సభ్యులు
చిత్రకారుడు :
శ్రీ వెల్లటూరి పూర్ణానంద శర్మ
ముఖచిత్రాలంకరణ
శ్రీ కె. సురేందర్






ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రచురణ
హైదరాబాదు

అంటరానితనం అమానుషం
అంటరానితనం పాపం
అంటరానితనం నేరం
అంటరానితనం రాజ్యాంగానికే విరుద్ధం

# ముందుమాట

విద్యార్థుల సర్వాంగీణ వికాసమే విద్య పరమావధి. విద్యా వ్యవస్థ ఈ అత్యున్నత ఆశయసాధనకై నిరంతరం కృషిచేస్తోంది. ఈ కృషిలో భాగంగా, రాబోయే దశాబ్దంలోకి అడుగిడుతున్న నేటి బాలబాలికల శ్రేయస్సును దృష్టియందుంచుకొని 1986 నాటి జాతీయ విద్యావిధానం రూపొందించబడింది. ఈ విధానం సూచించిన మేరకు తరగతి గదుల్లో గుణాత్మకమైన మార్పులకు ప్రయత్నం జరుగుతోంది. ఇందుకనుగుణంగా బోధనాంశాల పునర్నవీకరణ ప్రారంభమైంది. ఈ కృషిలో భాగంగానే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తమ రాష్ట్రంలోని పాఠశాలల్లో బోధించాల్సిన భాషా పాఠ్య ప్రణాళికను నిర్దేశించడానికి, కేంద్రీయ విశ్వవిద్యాలయం, హైదరాబాద్ తెలుగు శాఖ అధ్యక్షులు, ఆచార్య కె. కె. రంగనాథాచార్యులుగారి అధ్యక్షతన పాఠ్యప్రణాళికా నిర్మాణ సంఘాన్ని ఏర్పరిచింది. ఈ సంఘంలో విద్యావేత్తలు, భాషావేత్తలు వివిధ స్థాయిల్లో పనిచేసే ఉపన్యాసకులు, ముఖ్యంగా తరగతి గదుల్లో బోధించే ఉపాధ్యాయులు, ఉపాధ్యాయ సంఘాల ప్రతినిధులు సభ్యులు. వీరందరూ విస్తృతంగా చర్చించి చేసిన సిఫారసుల మేరకు ప్రభుత్వం తమ ఉత్తర్వు సంఖ్య జి.ఓ.ఎం.ఎస్. నెం. 353 (Edn.) Dated 9-10-1992ద్వారా తెలుగు భాషా పాఠ్యప్రణాళికలను ఆమోదించింది. ఈ సిఫారసులకనుగుణంగా ఈ పాఠ్యపుస్తక రచన సాగింది. ఈనాటి విద్యార్థుల భాషావసరాలు, విజ్ఞానావసరాలు, సామాజిక అవసరాలను దృష్టిలో ఉంచుకొని విషయపరమైన ధ్యేయంతో మాత్రమేగాక భాషానైపుణ్యాలు, అభిరుచులు, ఆసక్తులు, వైఖరులు, సృజనాత్మక శక్తులను ఇతోధికంగా అభివృద్ధిపరచాలనే ఉద్దేశంతో పాఠ్యాంశాల ఎంపిక జరిగింది.

ఈ పాఠ్యాంశాల్లో కథలు, సంభాషణలు, గేయ కథలు, జీవిత చరిత్ర, ఆత్మకథ, లేఖ, ప్రాచీన ఆధునిక పద్యాలు, వ్యాసం, మొదలైన వివిధ రచనా రూపాలతోబాటు ప్రతి పాఠం చివర ఒక సూక్తిని పరిచయం చేయడమైంది. అక్కడక్కడా పాఠ్యాంశాల్లోని భాషాస్థాయి కొంత అధికమనిపించవచ్చు. కాని బాలబాలికలు పరిసరాలు-ప్రసార సాధనాల ద్వారా అసంకల్పితంగా భాషను గ్రహిస్తారు కనుక ఈ భాషాస్థాయిని వారు పొందడానికి ఉపాధ్యాయులు సహకరించడంలో ఇబ్బంది కలుగదని మా నమ్మకం. ప్రతి పాఠానికి ముందు పదాల పట్టిక బాలబాలికలకు, ఉపాధ్యాయినీ - ఉపాధ్యాయులకు ఉపకరించే విధంగా విపులమైన అభ్యాసవేదిక సిద్ధంచేయబడింది. పిల్లల భాషాభివృద్ధియే ఈ అభ్యాసాల ప్రముఖ ధ్యేయం. ఆంధ్రప్రదేశ్ ప్రాథమిక విద్యాపథకం వారి బోధన మూలసూత్రమైన కృత్యాధార పద్ధతిని కూడా దృష్టియందుంచుకోవటం జరిగింది. ఈ అభ్యాసాల్లో మొదట పదాలకు సూచించిన అర్థాలు వీలయినంత దగ్గరగా ఉండేట్లు

చూడటం జరిగింది. సందర్భాన్నిబట్టి ఉపాధ్యాయులే అర్థాలను వివరించాలి. అట్లే పొందుపరిచిన ప్రశ్నరూపాలు కేవలం సూచన ప్రాయం మాత్రమే. కింది తరగతుల్లో పరిచయంచేసిన పలు రకాల అభ్యాసాలనుకూడా దృష్టియందుంచుకొని ఉపాధ్యాయులు పిల్లలకు మరిన్ని అభ్యాసాలు సమకూర్చాలి. సూక్తులను వివరించాలి. ప్రార్థనలో ప్రతిరోజూ ఒక సూక్తి చెప్పాలి. తద్వారా వారి సమగ్రాభివృద్ధికి మార్గదర్శకులు కావాలి. వారిలో ఆలోచనలు రేకెత్తించడంలోనూ, పాఠ్యాంశాలలోని వస్తువునూ, అందులోని భావాల్నీ దైనందిన జీవిత సన్నివేశాలతో సమన్వయించి బోధించడంలో ఉపాధ్యాయులు చొరవ చూపాల్సిన అవసరముంది. కేవలం విషయబోధన కాక బాలబాలికల అభిరుచులు, ఆసక్తులు, వైఖరులు, సృజనాత్మకత మొదలగు అంతర్గత శక్తుల్ని వెలికి తీయడంలో జిజ్ఞాసువులైన ఉపాధ్యా యులు తమ వంతు కర్తవ్యాన్ని నిర్వహిస్తారని దృఢ విశ్వాసం. పాఠ్యాంశాల చివర అ పుస్తకాలకు వలెనే అకారాదిక్రమంలో పదపట్టికను కూడా పొందుపరచడం జరిగిం . దీని ద్వారా నిఘంటువులను చూసే అలవాటు బాలబాలికలకు ఏర్పడటానికి అవకాశం ఉంది. అందుకు ఉపాధ్యాయులు తోడ్పడాలి.

మన రాష్ట్రంలో మాట్లాడే భాషలో అనేక మాండలికాలున్నాయి. అయితే తెలుగువాచకాల్లో వీలైనంతవరకు ఆధునిక ప్రామాణిక భాషకు దగ్గరగా ఉండే భాషారూపాన్ని ఉపయోగించడం జరిగింది. ఇందుకు ఉపన్యాసాలు, సినిమాలు, రేడియోలు, పత్రికలు, టెలివిజన్ లలో వాడుకలోనున్న భాషారూపాలే ఆధారాలు. ఆయా ప్రాంతాల్లో బోధించే ఉపాధ్యాయులు ఈ అంశాన్ని ంచగలరు. తలిదండ్రులు గూడా గుర్తించగలరు.

ఈ వాచకంలో 'సుభా త్నావళి' ని చేర్చడం జరిగింది. వీటిని నేరుగా విద్యార్థులే చదువుకోవాలనే ఉద్దే తో మాత్రం చేర్చలేదు. భార రాజ్యాంగంలోని లౌకిక సూత్రాలకు అనుగుణంగా విలువలతో కూడిన విద్యావిధానాన్ని వేశపెడుతున్నాం. వ్యక్తిగతమైన విలువలు, సామాజికమైన విలువలు, జాతీయమైన విలు లు విద్యార్థితరానికి అందించాల్సిన బాధ్యతను గుర్తించి ప్రభుత్వం ఈ ప్రయత్నం చేస్తున్నది. పాఠశాలలో ఉపాధ్యాయులు, ఉపాధ్యాయినులు, ఇంటివద్ద పెద్దలు, తాము సావధానంగా చదివి, అవగాహన చేసికొని బాలబాలికలకు ఇందులోని విషయాలు బోధపరిచి వాటిని ఆచరణ సాధ్యంచెయ్యాలని సంకల్పం. సాధారణ పాఠాలతో బాటు ఉన్నత మానవత్వపు విలువల్ని వివరించే ఈ అంశాలు బాలబాలికలకు తెలిసినపుడు వారు ఉత్తమ మానవులుగా, ప్రేమమూర్తులుగా రూపొందే అవకాశం కలుగుతుంది. ఇందుకు విద్యావ్యవస్థతో సంబంధమున్న ప్రతి ఒక్కరూ సహకరిస్తారనే మా నమ్మకం.

ఈ పాఠ్య పుస్తకాలపై సూచనలను సలహాలను ఇవ్వదలచినవారు వాటిని పాఠశాల విద్యాశాఖ సంచాలకులవారి కార్యాలయానికి నేరుగా పంపించవచ్చు. అవసరమైన వాటిని మలి ముద్రణలో తగినవిధంగా పొందుపరచడం జరుగుతుంది.

—— 0 ——

88/295

# విషయసూచిక

—— o ——

# వందేమాతరం

—బంకించంద్ర ఛటర్జీ

వందేమాతరం
సుజలాం సుఫలాం మలయజ శీతలాం
సస్యశ్యామలాం మాతరం; వందేమాతరం
శుభ్రజ్యోత్స్న పులకిత యామినీం
ఫుల్లకుసుమిత ద్రుమదళ శోభినీం
సుహాసినీం సుమధుర భాషిణీం
సుఖదాం వరదాం మాతరం వందేమాతరం.

భావం : భారతమాతకు వందనం. తియ్యని నీటితో, కమ్మని పండ్లతో, చల్లని మలయమారుతాలతో, పచ్చని పైర్లతో విలసిల్లే భారతమాతకు వందనం. రాత్రులు తెల్లని వెన్నెలలతో పులకిస్తూ విరబూసిన చెట్లతో శోభిస్తూ స్వచ్ఛమైన నవ్వులతో, మధురమైన మాటలతో మాకు సుఖాలు కలిగిస్తూ వరాలనిచ్చే భారతమాతకు వందనం.

ఉపాధ్యాయులకు సూచన :

స్వాతంత్ర్యసమరంలో వందేమాతరం గీతం యావద్భారతదేశాన్ని ఉత్తేజితులుగాగించింది. దీన్ని స్వాతంత్ర్య విప్లవగీతంగా భారతీయులందరూ గానం చేశారు. ఇది బ్రిటిష్ సామ్రాజ్యానికి వ్యతిరేక సింహగర్జనలా మారుమ్రోగింది. దేశభక్తికీ, స్వాతంత్ర్య పిపాసకూ ఈ గీతం ప్రతీకగా నిలిచింది. ఈ గీతం బంకించంద్ర ఛటర్జీ వ్రాసిన 'ఆనంద్ మఠ్' నవలలోనిది.

ఈ గీతాన్ని రోజూ ప్రార్థనా సమయంలో లయబద్ధంగా పాడించాలి. భావం చెప్పించాలి.

—— o ——

# సారే జహాఁ సె అచ్ఛా

—మహమ్మద్ ఇఖ్బాల్

సారే జహాఁ సె అచ్ఛా హిందూస్తాఁ హమారా
హమ్ బుల్ బులేహైఁ ఇస్‌కే, యే గుల్ సితాఁ హమారా ॥

పరబత్ వో సబ్ సే ఊంఛా హమ్‌సాయా ఆస్మాఁ కా
వో సంతరీ హమారా ! వో పాస్‌బాఁ హమారా ॥

గోదీమె ఖేల్‌తీహైఁ ఇస్‌కీ హజారోఁ నదియాఁ
గుల్‌షన్ హై జిన్ కే దమ్ సే రష్ కె జినాఁ హమారా ॥

మజ్ హబ్ నహీఁ సిఖాతా ఆపస్‌మె బైర్ రఖ్‌నా
హిందీ హైఁ హమ్, వతన్ హైఁ హిందూస్తాఁ హమారా ॥

భావం : ప్రపంచంలోకెల్లా మన భారతదేశం ఉత్తమమైంది. ఇది మనకో ఉద్యానవనం. మన మిక్కడ బుల్బుల్ పిట్టలం. ఆకాశాన్నంటే ఆ మహోన్నత పర్వతం ఆ పక్కన మనకు కాపలాగా రక్షణగా నిలిచివుంది. ఈ దేశమాత ఒడిలో వేలాది నదులు ఆడుకుంటున్నాయి. ఈ నదీజలాలతో వికసించిన పూదోటను చూసి స్వర్గమే అసూయపడుతున్నది. మతం పరస్పర వైరాన్ని బోధించదు. మనమంతా భారతీయులం. మనదేశం భారతదేశం.

ఉపాధ్యాయులకు సూచన :

ఈ గీతాన్ని రోజూ ప్రార్థనా సమయంలో లయబద్ధంగా పాడించాలి.

—— o ——

# ఝుండా ఊంఛా రహే హమారా

—శ్యాంలాల్ గుప్త పార్షద్

విజయీ విశ్వ తిరంగా ప్యారా
ఝుండా ఊంఛా రహే హమారా ॥ ॥ ఝుండా ॥

సదా శక్తి బర్సానే వాలా
ప్రేమ సుధా సర్సానే వాలా
వీరోంకో హర్షానే వాలా
మాతృ భూమికా తన్ మన్ సారా ॥ ఝుండా ॥

స్వతంత్రతాకీ భీషణ రణ్‌మే
లగ్‌కర్ బఢే జోష్ క్షణ్ క్షణ్‌మే
కావే శత్రు దేఖ్‌కర్ మన్‌మే
మిట్‌జావే భయ సంకట్ సారా ॥ ఝుండా ॥

ఇన్ ఝుండేకే నీచే నిర్భయ
లే స్వరాజ్య యహ అవిచల నిశ్చయ్
బోలో, భారత్ మాతాకీ జయ్
స్వతంత్రతా హి ధ్యేయ హమారా ॥ ॥ ఝుండా ॥

ఇస్‌కీ షాన్ న జానేపావే
చాహె జాన్ భలేహి జాయె
విశ్వ విజయ్ కర్ కే దిఖ్ లావే
తబ్ హెూవే ప్రణ పూర్ణ హమారా        ॥ ఝండా ॥

భావం : ప్రియమైన మా త్రివర్ణ పతాకం విజయంతో విశ్వంలో ఎత్తున రెపరెపలాడుతుండుగాక !        ॥ ప్రియమైన ॥

ఎల్లప్పుడూ శక్తిని కురిపించేది, ప్రేమామృతం చిలికేది, వీరులకు హర్షదాయకమైంది, మాతృభూమి తనువుకూ, మనస్సుకూ ప్రతీకగా ఉండే విధంగా        ॥ ప్రియమైన ॥

భీకర స్వాతంత్ర్య సమరంలో క్షణక్షణం శత్రువుల నెదిరించే ఉత్సాహం కలిగిస్తూ చూచినంతనే మనసుల్లో భయసంకటాలు నశించేటట్లు        ॥ ప్రియమైన ॥

ఈ జెండా నీడలో నిర్భయులమై నిశ్చలులమై స్వరాజ్యం సాధించేందుకు నిశ్చయించుకొని, స్వాతంత్ర్యమే మా ధ్యేయమని భారతమాతకు జయమని నినదిస్తూ        ॥ ప్రియమైన ॥

ప్రాణాలు పోయినప్పటికీ ఈ జెండా గౌరవం కాపాడుకోవాలి. విశ్వవిజయం సాధించి చూపిస్తాం. అప్పుడే మన ప్రతిజ్ఞ పూర్తిగా నెరవేరుతుంది.        ॥ ప్రియమైన ॥

ఉపాధ్యాయులకు సూచన :

ఈ గేయాన్ని ప్రార్థనా సమయంలో ప్రతి రోజూ విద్యార్థులచేత లయబద్ధంగా పాడించాలి. భావం చెప్పించాలి.

——— o ———

# దేశమును ప్రేమించుమన్నా !

—గురజాడ అప్పారావు

దేశమును ప్రేమించుమన్నా !
మంచి యన్నది పెంచుమన్నా !
వట్టిమాటలు కట్టి పెట్టోయ్,
గట్టిమేల్ తల పెట్టవోయ్.

పాడిపంటలు పొంగి పొర్లే
దారిలో నువు పాటు పడవోయ్,
తిండి కలిగితె కండ కలదోయ్,
కండకలవాడేను మనిషోయ్.

ఈను స్పర్థను విద్యలందే,
వైరములు వాణిజ్యమందే,
వ్యర్థకలహము పెంచబోకోయ్,
కత్తి వైరం కాల్చవోయ్.

దేశాభిమానం నాకు కద్దని
వట్టి గొప్పలు చెప్పుకోకోయ్,
పూని యేదైనాను ఒక మేల్
కూర్చి జనులకు చూపవోయ్.

సొంతలాభం కొంతమానుకు
పొరుగువాడికి తోడుపడవోయ్,
దేశమంటే మట్టి కాదోయ్,
దేశమంటే మనుషులోయ్.

దేశమనియెడి దొడ్డవృక్షం
ప్రేమలను పూలెత్తవలెనోయ్,
నరుల చెమటను తడిసి మూలం
ధనం పంటలు పండవలెనోయ్.

ఆకులందున అణగి మణగీ
కవితకోయిల పలుకవలెనోయ్,
పలుకులను విని దేశమం దభి
మానములు మొలకెత్తవలెనోయ్.

ఉపాధ్యాయులకు సూచనలు :

1. ఈ గేయాన్ని విద్యార్థులచేత పాడించాలి.
2. ఈ గేయంలోని భావాలను వివరించాలి.
3. 'దేశసేవ – మానవ సేవ' అనే భావాలను విద్యార్థులకు విశదంగా చెప్పి, వారు ఇతరులకు సాయపడేట్లు చూడాలి.
4. కొందరు దేశభక్తులను గురించి చెప్పి, వారిని గురించి విద్యార్థులచేత చెప్పించాలి.

—— o ——

# మా తెలుగు తల్లి

—శంకరంబాడి సుందరాచారి

మా తెలుగు తల్లికి మల్లె పూదండ
మా కన్న తల్లికి మంగళారతులు
కడుపులో బంగారు కనుచూపులో కరుణ
చిరునవ్వులో సిరులు దొరలించు మా తల్లి

గలగలా గోదారి కదలిపోతుంటేను
బిరబిరా కృష్ణమ్మ పరుగులిడుతుంటేను
బంగారు పంటలే పండుతాయి
మురిపాల ముత్యాలు దొరలుతాయి.

అమరావతీ నగర అపురూప శిల్పాలు
త్యాగయ్య గొంతులో తారాడు నాదాలు
తిక్కయ్య కలములో తియ్యందనాలు
నిత్యమై, నిఖిలమై నిలిచియుండేదాక

రుద్రమ్మ భుజశక్తి, మల్లమ్మ పతి భక్తి
తిమ్మరుసు ధీయుక్తి, కృష్ణరాయని కీర్తి
మా చెవుల రింగుమని మారుమ్రోగే దాక
నీ ఆటలే ఆడుతాం – నీ పాటలే పాడుతాం
జై తెలుగు తల్లి ! జై తెలుగు తల్లి !

**ఉపాధ్యాయులకు సూచన :**

ఈ గీతాన్ని విద్యార్థులు భావానుగుణంగా పాడడం నేర్పండి.

సభలు – సమావేశాల మొదట పాడించండి.

# భరతమాత

జయ జయ జయ ప్రియ భారత
జనయిత్రీ దివ్యధాత్రి !
జయ జయ జయ శత సహస్ర
నరనారీ హృదయనేత్రి !

జయ జయ సస్యామల సు
శ్యామ చల చ్చేలాంచల !
జయ వసంత కుసుమ లతా
చలిత లలిత చూర్ణకుంతల !
జయ మదీయ హృదయాశయ
లాక్షారుణ పదయుగళా !

జయ జయ జయ ....

జయ దిశాంత గత శకుంత
దివ్యగాన పరితోషణ !
జయ గాయక వైతాళిక
గళ విశాల పథ విహరణ !
జయ మదీయ మధుర గేయ
చుంబిత సుందర చరణా !

జయ జయ జయ ....

శ్రీ దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి

---

భరతమాతను స్తుతించే ఈ గేయం విద్యార్థులు కంఠస్థంచేసి పాడుకోవడానికి మాత్రమే ఉద్దేశించబడింది.

# పరోపకారం

(ఆపదలో ఉన్న ఎవరినైనా చూసినప్పుడు జాలిపడి వారికి చేతనైన సహాయం చేయడం మన ధర్మం. ఈ కథ చదవండి.)

ఒకప్పుడు ఒక బాటసారి దగ్గరలో ఉన్న పట్టణానికి ప్రయాణమయ్యాడు. కొంత దూరం వెళ్ళేసరికి కొంతమంది దొంగలు అతనివద్ద ఉన్న ధనం దోచుకొని, అతణ్ణి స్పృహ తప్పేటట్లు కొట్టి వెళ్ళిపోయారు. కొంతసేపటికి మరో బాటసారి ఆ దారినే వచ్చాడు. "కొనప్రాణంతో ఉన్న ఇతనిని మా ఇంటికి తీసుకుపోవడానికి ఎంతో శ్రమపడాలి, ఇతను బాగవడానికి ఎంత డబ్బు ఖర్చుచేయాలో ! ఖర్చు పెట్టినా బతక్కపోతే నా సొమ్మంతా దండగ. ఒకవేళ బతికితే నా సొమ్ము నా కిస్తాడో లేదో ! ఇదంతా నాకెందుకు ? ఇతడేమైనా నా చుట్టమా ? " అని అనుకొని తనదారిన తాను వెళ్లిపోయాడు. మరికొంతసేపటికి ఇంకొక బాటసారి ఆ దారినే వెళుతూ, కొన ఊపిరితో ఉన్న ఆ బాటసారినే చూసి ముందు కొంతజాలిపడినా, తరవాత " ఇలాంటివి ఎన్నో జరుగుతుంటాయి. ఏం చేస్తాం? ఇతనికి తోడ్పడటమంటే గాలికిపోయే ముళ్లకంపను తెచ్చి నెత్తిమీద పెట్టుకొన్నట్లవుతుంది. మెచ్చి లోకం నాకేమైనా మేకతోలు కప్పుతుందా ? ఎవడి అవస్థ వాడిదే, నాకెందుకు ? " అంటూ వెళ్లిపోయాడు.

మరికొంతసేపటికి దయగల మరొక బాటసారి ఆ దారినే వెళుతూ నెత్తురు ముద్దలాగా పడి ఉన్న బాటసారిని చూశాడు. అతని గుండె

నీరై పోయింది. తరవాత బాటసారి గాయాలపై కట్లు కట్టాడు. నోట్లో ద్రాక్షరసం కొద్దికొద్దిగా పోశాడు. అతనికి కొంత శక్తి వచ్చిం తరవాత నెమ్మదిగా లేవనెత్తి వాహనంమీద కూర్చోబెట్టుకొని పట్నానికి తీసుకువెళ్లాడు.

కొందరు మహానుభావులు తమకు కలిగే కష్టాలనుకూడా లెక్కచేయక ఇతరులకు ఉపకారం చేస్తారు. వారే ఉత్తములు. పై కథలో, గాయాలతోఉన్న బాటసారికి సహాయపడిన దయామయుడు ఈ కోవకు చెందినవాడు !

**ఉపాధ్యాయులకు సూచనలు :**

1. కష్టాలలో ఉన్న తోటి విద్యార్థులకు సాయపడవలసిందిగా విద్యార్థులను ప్రోత్సహించాలి.
2. అంగవికలులైనవారికీ, వృద్ధులకూ వారి పనులు నిర్వహించడంలో తోడ్పడేట్లు పిల్లలను పురికొల్పాలి.
3. బాలబాలికలు ఇంతకుముందు ఎవరికైనా తోడ్పడి ఉంటే వారి అనుభవాలను చెప్పించి, మిగిలిన పిల్లలు తెలుసుకొనేట్లు చేయాలి.

—— o ——

# స్వామి వివేకానందుడు

కలకత్తా నగరంలో విశ్వనాథదత్తనే సుప్రసిద్ధ న్యాయవాది ఉన్నాడు. ఆయన భార్య భువనేశ్వరీదేవి పేరుకు తగిన సుగుణాలరాశి. ఆ దంపతులకు 1863 జనవరి 12 తేదీన, మకరసంక్రాంతి పండుగనాడు ఒక అందాల మగబిడ్డ జన్మించాడు. బిడ్డకు నరేంద్రనాథదత్త అని పేరుపెట్టుకున్నారు. ముద్దుగా 'నరేన్' అని పిలుచుకునేవారు.

బాలుడు ఆటపాటల్లోను, చదువులోను ఎంతో చురుకుగా ఉండేవాడు. 16వ ఏట ప్రవేశ పరీక్షలో ప్రథమశ్రేణి సంపాదించి, 18వ ఏట ఎఫ్. ఏ. పరీక్షలో ఉత్తీర్ణుడైనాడు.

క్రమంగా అతడు తత్వవిషయాలపై బుద్ధి లగ్నంచేసి వాటికి సంబంధించిన గ్రంథాలు ఎడతెగకుండా చదివేవాడు. చిన్నవయసులోనే అతనికి భగవంతుని దర్శించాలనే తపన ప్రారంభమైంది.

ఇంతలో నరేన్ తండ్రి–విశ్వనాథదత్త – మరణించాడు. కుటుంబభారం నరేన్‌పై పడింది. నరేన్‌కు ఉద్యోగంకూడా దొరకలేదు. మనోధైర్యం, ఆత్మవిశ్వాసం మాత్రం సడలలేదు.

భగవంతుని చూడాలనే పట్టుదల, తత్త్వాన్వేషణ అతనికి అధికమైనాయి. పెండ్లినిగూర్చిన ఆలోచన పూర్తిగా మానేశాడు. దేశంలో తనకంటే పేదరికంతో బాధపడేవార్ని చూచి ఎంతో బాధపడేవాడు. తినటానికి తిండి లేకపస్తులుండేవా

రెండరో ఉండగా, తాను మాత్రం ఎందుకు తినాలని అప్పుడప్పుడు తానూ పస్తులుండేవాడు. "మనిషిలోనే భగవంతు డుంటే మానవు లిన్ని కష్టాలు పడవలసిన అవసర మేముంది? ఏమైనా సరే, భగవంతుణ్ణి పట్టుకోవాలి. భగవంతు డెక్కడున్నాడు ? మీకు కనిపించాడా ? నాకు చూపించగలరా?" - ఇటువంటి ప్రశ్నలు అనేక తాత్త్వికుల్ని అడిగేవాడు. జవాబు దొరకనేలేదు.

ఒకనాడు నరేన్‌కు రామకృష్ణ పరమహంస సన్నిధి లభించింది. తనను వేధిస్తున్న ప్రశ్నలు ఆయననూ అడిగాడు. పరమహంస జవాబు చెప్పాడు. "భగవంతు డున్నాడు; నిన్ను చూచినట్లే ఆయననూ చూస్తాను; నీకూ చూపించగలను" అంటూ పరమహంస నరేన్‌ను స్పృశించాడు. అంతే! ఒక్కసారి మెరుపు మెరిసినట్లైంది. విద్యుద్ఘాతం తగిలినట్లైంది - నరేన్ స్పృహ తప్పి పడిపోయాడు. తేరుకొని, మేలుకొని, రామకృష్ణ పరమహంసను చూశాడు. ఆయన మాటలలోని నిజాన్ని తెలుసుకున్నాడు. హస్తస్పర్శ మాత్రంచేతనే భగవంతుని చూపగలిగినందుకు ఆ గురుదేవునకు తన జీవితాన్నే అంకితం చేశాడు. గురుదేవుని ఆశీస్సులతో అచిరకాలంలోనే 'నరేన్' వివేకానందుడు కాగలిగాడు.

వివేకానందుడు గురుదేవుని సందేశం ప్రపంచానికి అందించవలసిన అవసరం గుర్తించాడు. ఆ సమయం ఆసన్నమైంది. అమెరికాలోని షికాగో నగరంలో ప్రపంచ సర్వమత మహాసభ జరుగుతున్నది. వేదికపై వివేకానందుడు నిలిచాడు. ఆప్యాయత తొణికిసలాడే అమృత మధురస్వరంతో "అమెరికా సోదరీ సోదరులారా!" అని సంబోధించాడు. అప్పటిదాకా అమెరికాకు తెలియని వింత సంబోధన అది. కనీ వినీ ఎరుగని ఆత్మీయమైన ఆ సంబోధనతో

7000 మంది ప్రతినిధులు నిలువునా పులకించి, నిలబడి, తయిదు నిముషాలపాటు అఖండ కరతాళధ్వనులు చేశారు. వివేకానందుడు గొంతెత్తి, మృదుల గంభీరస్వరంతో విశ్వజనీనమైన హిందూమత సిద్ధాంతాలను విశదంగా వినిపించాడు. పాశ్చాత్య ప్రపంచం హిందూమతానికి ఎంత ఋణపడివుందో అందరూ తెలుసుకొనేటట్లు చేసి, స్వదేశానికి వచ్చాడు.

భారతీయ వేదాంతం మాటలలో కాక ఆచరణలో చూపిన కర్మవీరుడు వివేకానందుడు. ఆత్మబలానికీ, శరీరబలానికి సమప్రాధాన్యమిచ్చి 'ఉక్కునరాలతో ఇనుప పిడికిళ్ళతో' భారతయువకులు పురోగమించాలని ఆయన ఉద్బోధ. భారతీయాత్మను జాగృతం చేసి, యువతను ప్రభావితంచేసి, ప్రాచీన భారత వైభవాన్ని భారతీయులకే కాక ప్రపంచ ప్రజలకు కూడా సాక్షాత్కారింపజేసిన ప్రజ్ఞ ఆయనది.

మంచి ఆరోగ్యంతో 39 సం॥ వయస్సులో ఉన్న వివేకానందుడు 1902 జులై 4వ తేదీ సాయంకాలం ధ్యాననిష్ఠలో మునిగి, ప్రశాంతంగా ప్రాణం విడిచాడు. జీవించింది నలభై యేళ్లలోపే అయినా భారతీయుల గుండెల్లో కలకాలం జీవించగలిగిన చిరంజీవి ఆయన. ఆయన సూక్తులు చిరస్మరణీయాలు. ఆయన సూక్తులు కొన్ని ఈ క్రింద పొందుపరచబడినాయి.

1. నా భారతదేశంలోని ధూళి, గాలి, నేల నన్ను తగిలినకొద్దీ అవి నాకు పవిత్రంగా దివ్యంగా కనిపిస్తున్నాయి. ఈ భూమి దివ్యభూమి; యాత్రాక్షేత్రం; తీర్థప్రదేశం.
2. సహనం సాత్వికత్వం మూర్తీభవించిన భారతజాతికి ఋణపడినంతగా ప్రపంచం మరేజాతికీ ఋణపడిలేదు.
3. భగవంతుని పూజించటమంటే మనలో దాగివున్న భగవదంశను పూజించటమే.
4. ప్రేమకు అపజయం లేదు; నేడైనా, రేపైనా, యుగాంతరాల్లోనైనా ప్రేమే జయిస్తుంది. మరి, నీ సాటివారిని నువ్వు ప్రేమిస్తున్నావా ?

5. నిస్వార్థమైంది నీతి; స్వార్థపూరితమైంది అవినీతి.

6. ఉన్నతమైన విశ్వనీతి స్వార్థత్యాగమే; స్వార్థాన్ని బలపరుచుకోవటం మాత్రం కాదు.

7. మనిషిలోవున్న శారీరకబలాన్ని గూర్చి, ఆత్మబలాన్నిగూర్చి మనిషికి బాగా బోధించాలి.

8. చావు బతుకులు ఎక్కడో లేవు, బలంలో బతుకుంది; బలహీనతలో చావుంది.

9. ఇంతకాలం మనం దుఃఖించింది చాలు, ఇక దుఃఖం వద్దు; మన కాళ్ళపై మనం నిలిచి మనుష్యుల్లా బతకాలి.

10. అన్నిటికంటే విశ్వాసం ముఖ్యమైంది. మనకు మనయందు విశ్వాసం ఉండాలి; భగవంతునియందు విశ్వాసం ఉండాలి. ఈ రెండు విశ్వాసాల్లోనే మనిషి గొప్పతనం ఉంది.

**అర్థాలు :**

పరమహంస = ఉన్నతపదం పొందిన సన్యాసి; విద్యుద్ఘాతం = మెరుపుదెబ్బ; అఖండకరతాళ ధ్వనులు = ఎడతెగని చప్పట్లు; గర్జాగంభీరరవం = సింహగర్జనవలె లోలోపలినుంచి వచ్చే గంభీర కంఠధ్వని; గంభీరరవం = మంద్రధ్వని; విశ్వజనీనము = ప్రపంచ ప్రజలందరికీ సంబంధించింది.

**ఉపాధ్యాయులకు సూచన :**

వివేకానందుని జీవితంనుండి విద్యార్థులు గ్రహించదగిన నీతిని వివరించి, వారి మాటలలో వాటిని తిరిగి చెప్పించాలి.

——— o ———

# చెట్ల రక్షణ

నేలపై సాగే మన జీవితం మన చుట్టూ ఉన్న అన్ని రకాల ప్రాణులతో ముడిపడి ఉంది. ప్రాణుల ప్రపంచంలో చెట్ల చేమల పాత్ర ఎక్కువ. మనం ప్రకృతిని గమనిస్తే చెట్లు ఎంతో మేలు చేస్తాయని గ్రహించవచ్చు. నిజానికి జీవరాసులు జీవించడంకోసం ప్రత్యక్షంగాకానీ, పరోక్షంగాకానీ అవసరమైన ప్రాథమిక ఆహారాన్ని సృష్టిస్తున్న సజీవమైన వనరులు చెట్లు మాత్రమే.

వాతావరణంలోని సూర్యరశ్మిని గ్రహించి, గాలిలోని కార్బనామ్ల వాయువును సమ్మేళనంచేసి, చెట్లు తమ ఆహారం తయారుచేసుకొంటాయి. ఈ ఆహారంలో కొంత భాగం తమ పెరుగుదలకు వినియోగించుకొని కొంత నిల్వచేసుకొంటాయి. అట్లా నిల్వచేసుకొన్న ఆహారం మనుషులకూ, జంతువులకూ ఉపయోగపడుతోంది.

కాబట్టి చెట్లు లేకపోతే ప్రపంచంలో జీవకోటి ఉండదు. చెట్లపై ఆధారపడి జీవించే ప్రాణులన్నీ కలి చావుకు లోనవుతాయి. అందువల్ల ఈ ప్రాణులను భక్షించి బతికే జీవులు మరణిస్తాయి. ఉదాహరణకు పునుగుపిల్లులు, ముంగిసలు పక్షులను తిని బతుకుతాయి. పక్షులు క్రిమికీటకాలను తిని జీవిస్తాయి. ఈ క్రిమికీటకాలకు జీవనాధారం చెట్లు చేమలు. దీన్నిబట్టి జీవితపు గొలుసు ఎట్లా ఏర్పడిందో తెలుసుకోవచ్చు.

చెట్లవల్ల కలప, వెదురు, తేనె, కుంకుడుకాయలు, లక్క, మూలికలు, రబ్బరు మొదలయిన ఉపయోగపడే వస్తువులు లభిస్తాయి. అంతేకాకుండా

పిల్లలకు ఆకర్షణీయమైన చెక్కబొమ్మలు లభిస్తాయి. చెట్లవల్ల వర్షంకూడాఅధికంగా కురుస్తుంది. ప్రపంచంలో చెట్లు లేకపోయినట్లయితే ప్రాణులు పీల్చుకోడానికి స్వచ్ఛమైన గాలికి లోటు ఏర్పడుతుంది. ఎందుకంటే చెట్లు ప్రాణవాయువును అందించడంతోపాటు ఇతర ప్రాణులు వదిలే ప్రాణాపాయకరమైన కార్బనామ్ల వాయువును గ్రహిస్తాయి. అందుకే మనం వనమహోత్సవాలను జరపడంతోపాటు ఇంటికో చెట్టు పెంచే కార్యక్రమం కూడా నిర్వహించాలి.

" పచ్చని చెట్లు - ప్రగతికి మెట్లు "

**ఉపాధ్యాయులకు సూచనలు :**

1. పరిసర ప్రాంతాల్లో ఉండే చెట్లనూ అడవులనూ పరిశీలించి, అక్కడ లభించే వస్తువులను పట్టికగా రాయమని పిల్లలకు చెప్పాలి.
2. దగ్గరగా ఉండే అడవులలో దొరికే వస్తువులను సేకరించి వాటిని తరగతిలో ప్రదర్శించాలి.
3. పాఠశాల ఆవరణలోగాని, గృహపరిసరాల్లోగాని మొక్కలను పెంచమని పిల్లలను ప్రోత్సహించాలి.

—— o ——

కుక్షిజీవనులకు
నక్షరంబు జిహ్వకక్షురసము
అక్షరంబుతన్ను రక్షించుగావున
నక్షరంబు లోకరక్షితంబు

# జాతీయ గీతం

జనగణమన అధినాయక జయహే
భారత భాగ్య విధాతా !
పంజాబ, సింధు, గుజరాత, మరాఠా,
ద్రావిడ, ఉత్కళ, వంగ !
వింధ్య, హిమాచల, యమునా, గంగ,
ఉచ్ఛలజలధితరంగ !
తవ శుభనామే జాగే !
తవ శుభ ఆశిష మాగే !
గాహే తవ జయగాథా !
జన గణ మంగళ దాయక జయహే
భారత భాగ్య విధాతా !
జయహే ! జయహే ! జయహే !
జయ జయ జయ జయహే !

**భావం :**

జనులందరి మనస్సులకు అధినేతవూ భారతభాగ్య విధాతవూ అయిన నీకు జయమగుగాక ! పంజాబు, సింధు, గుజరాతు, మహారాష్ట్ర, ద్రావిడం, ఉత్కళ, వంగ దేశాలతోను, వింధ్య హిమాలయ పర్వతా లోను, యమునా, గంగా ప్రవాహాలతో ఉవ్వెత్తుగా లేచే సముద్ర తరంగాలతోను భించే ఓ భారత భాగ్యవిధాతా! వాటికి నీ శుభనామం ఉద్బోధ కలిగిస్తుంది. అవి ఆశీస్సులు అర్థిస్తాయి. నీ జయగాథల్ని గానం చేస్తాయి. సమస్త జనులకు మంగళప్రదాతవూ, భారత భాగ్యవిధాతవూ అయిన నీకు జయమగుగాక ! జయమగుగాక !జయమగుగాక !

**ఒక వివరణ :**

ఈ గీతం అవిభక్త భారతదేశంలోని రాష్ట్రాలను సూచిస్తుంది. సింధుప్రాంతం ఇప్పుడు పాకిస్తాన్‌లో ఉంది. 'మరాఠా' అంటే మహారాష్ట్రం. 'ద్రావిడ' అంటే తమిళ, ఆంధ్ర, కర్ణాట, కేరళ ప్రాంతాలు.'ఉత్కళ' అంటే ఒరిస్సా. 'వంగ' అంటే ఇప్పటి పశ్చిమబెంగాలు.

ఉపాధ్యాయులు పిల్లలందరిచేతా ఈ గీతాన్ని సుస్వరంతో పాడించాలి.

—— 0 ——

# ప్రతిజ్ఞ

భారతదేశం నా మాతృభూమి. భారతీయులందరు నా సహోదరులు.

నేను నా దేశాన్ని ప్రేమిస్తున్నాను. సుసంపన్నమైన, బహువిధమైన నా దేశ వారసత్వ సంపద నాకు గర్వకారణం. దీనికి అర్హతపొందడానికి సర్వదా నేను కృషి చేస్తాను.

నా తల్లిదండ్రుల్ని, ఉపాధ్యాయుల్ని, పెద్దలందర్ని గౌరవిస్తాను. ప్రతివారితోను మర్యాదగా నడుచుకొంటాను.

నా దేశంపట్ల, నా ప్రజలపట్ల సేవానిరతితో ఉంటానని ప్రతిజ్ఞ చేస్తున్నాను.

వారి శ్రేయోభివృద్ధులే నా ఆనందానికి మూలం.

——— o ———

# 1. మన దేశం

(బాలబాలికల్లో దేశభక్తిని, ఐకమత్యాన్ని పెంపొందించడమే ఈ పాఠం ఉద్దేశం.)

**ఈ పాఠంలోని కొత్త పదాలు :**

విశాలం, నిలయం, సుందరం, ద్వేషం, రోషం, వేదన, పతాకం, చేబూను, ఐక్యపథం, పయనించు, మహాయుధం, మేధావి, ప్రగతిపథం, అనారోగ్యం, అవిద్య, అసమానత, ప్రజాస్వామ్యం, సామ్యవాదం, సాధించు.

* * *

విశాల భారత దేశం మనది,
హిమాలయాలకు నిలయమిది,
ఇలాంటి దేశంలో ప్రజలంతా
విశాల హృదయంతో మెలగాలి. ‖ విశాల ‖

మతాలు వేరయితేనేమి
భాషలు వేరయితేనేమి
భారతీయులం అందరం
భారత దేశం సుందరం. ‖ విశాల ‖

ద్వేషం, రోషం తొలగాలి.
ప్రేమ, స్నేహం వెలగాలి.
బుద్ధ గాంధీల బోధనలే
తొలగించును మన వేదనలే. ‖ విశాల ‖

ప్రేమ పతాకం చేబూని
ఐక్యపథంపై పయనిద్దాం.
త్యాగశక్తి మన మహాయుధంగా
దేశ శత్రువుల నెదిరిద్దాం. ‖ విశాల ‖

కూలీ, రైతూ, మేధావీ
చేయీ, చేయీ కలపాలీ
పల్లె, పట్నం ఏకంగా
ప్రగతి పథంపై కదలాలి. ॥ విశాల ॥

అనారోగ్యమూ, అవిద్యనూ
అసమానతనూ తొలగించాలి.
ప్రజాస్వామ్యమును కాపాడాలి.
సామ్యవాదమును సాధించాలి. ॥ విశాల ॥

(డా. దాశరథి)

## అభ్యాసవేదిక

ఉపాధ్యాయులకు సూచనలు :

1. కింది పదాలకు అర్థాలు చెప్పండి. రాయించండి.
   విశాలం – పెద్దది, నిలయం – స్థానం, సుందరం – అందం, వేదన – బాధ, పతాకం – జెండా, మహాయుధం – గొప్పయుద్ధ పరికరం, ఐక్యత – కలసి మెలసి ఉండటం, పథం – దారి, మేధావి – బుద్ధిశాలి.
2. కింది తరగతుల్లో చదివిన గేయాలను మళ్ళీ చదివించండి.
3. మనదేశం, రాష్ట్రం యొక్క గొప్పతనాన్ని చెప్పే గేయాలను సేకరించి విద్యార్థులచే పాడించండి. కంఠస్థం చేయించండి.
4. ప్రతి విద్యార్థి భావయుక్తంగా ఈ గేయం చదివేట్లు చూడండి.
5. రేడియో – టెలివిజన్‌లలో అప్పుడప్పుడూ ప్రసారమయ్యే దేశభక్తి గీతాలను సేకరించి పాడించండి.
6. ఈ కింది పదాలను వివరించండి.
   అనారోగ్యం, అవిద్య, అసమానత, ప్రజాస్వామ్యం, సామ్యవాదం.
7. ఈ కింది పదాలను ఉచ్చరించమనండి – ఉక్తలేఖనం చేయించండి.
   ద్వేషం, రోషం, మహాయుధం, ప్రగతిపథం, ప్రజాస్వామ్యం, సామ్యవాదం.
8. బుద్ధుడు,గాంధీజీముని లను సేకరించి 'అల్బమ్' లో అతికించమనండి.

జనని జన భూమిశ్చ స్వర్గాదపి గరీయసి

— 0 —

# 2. మేకపోతు గాంభీర్యం

(బలహీనులు కూడా బలవంతుల్ని కొన్ని సందర్భాల్లో ఎలా ఎదిరించవచ్చో ఈ పాఠం ద్వారా తెలిసికోవచ్చు.)

**ఈ పాఠంలోని కొత్త పదాలు :**

గాంభీర్యం, కాపరి, గమనించు, గుహ, నివాసస్థలం, మిలమిలా, వాడి, వింత, ముంగిలు, గుబగుబలు, గుప్పెట్లో పెట్టుకొను, బారి, దక్కించుకొను, జంకు, గద్దించు, మృగరాజా, బిడియపడు, తడబడు, ప్రతిజ్ఞ, దీక్ష, మోరగించు, హడలిపోవు, లంకించుకొను, డాబూ-డంబం, దర్పం, ప్రదర్శించు, పలుకుబడి.

* * *

ఒకానొకప్పుడు ఒక మేకల కాపరి ఉండేవాడు. అతనికి చాలా మేకలు ఉన్నాయి. మేతకోసమని ఆ మేకలమందను ప్రతిరోజూ అడవికి తోలుకెళ్తూ ఉండేవాడు. ఒకనాడొక మేకపోతు మందనుండి తప్పించుకొనిపోయింది. ఆ విషయం అతడు గమనించలేదు.



రాత్రి ఐంది. దానికి దారి తెలియలేదు. అటూయిటూ తిరగగా చివరికి ఒక కొండగుహ కనిపించింది. లోపలికి పోయి పడుకొన్నది. ఆ గుహలో నివసించే సింహం కొంత సేపటికి తన నివాస స్థలానికి వచ్చింది.

తన గుహలోపడుకొని వున్న మరో జంతువును సింహం చూసింది. చీకట్లో మేకపోతు కళ్ళు మిలమిలా మెరుస్తున్నాయి. పెద్ద గడ్డమూ, వాడిగా ఉన్న కొమ్ములూ ఉన్న ఆ వింత జంతువును చూడగానే సింహానికి భయం

వేసింది. అలాంటి వింతజంతువును సింహం ముందెన్నడూ చూసి ఉండలేదు. ఏమి చేయాలో తోచక, సింహం అలాగే గుహ ముంగిట నిలబడింది.

మేకపోతుకు కూడా సింహాన్ని చూడగానే గుండెల్లో గుబగుబలు బయలుదేరాయి. భయాన్ని బయటకు కన్పించనీకుండా ప్రాణాలను గుప్పిట్లో పెట్టుకొని మేకపోతు అలాగే పడుకొన్నది. సింహం బారినుండి బయటపడి ప్రాణాలు దక్కించుకోవడం ఎలాగ ?అని ఆలోచిస్తూ !



తెల్లవారుతుండగా, బయటకు వచ్చిందిమేకపోతు.సింహంజంకును కనిపెట్టిన మేకపోతు, "నీ వెవరవు? అని గద్దించింది. "నేను సింహాన్ని... మృగరాజుని...."అని బిడియ పడుతూ చెప్పి 'తమరెవరు ?' అని భయం భయంగా తడబడుతూ అడిగింది సింహం.

" ఓహా !.....నీవేనా సింహానివి....మృగరాజువా ? నా అదృష్టం పండింది.......వేయి ఏనుగులనూ, నూటికి పైగా పులులనూ నేను ఇప్పటివరకూ చంపాను తెలుసా ! సింహాన్ని చంపేవరకూ.......ఈ గడ్డం తీయనని ప్రతిజ్ఞ చేశాను. ఈనాటితో నా దీక్ష పూర్తైనట్లే......ఇప్పుడు నిన్ను చంపి నా గడ్డం పీడ వదిలించుకొంటాను..........." అంటూ తలను మోరగించి గంభీరంగా మేకపోతు ముందుకాళ్ళు రెండూ పైకెత్తి ఒక్క దూకు దూకింది. అది చూచిన సింహం హడలిపోయి పరుగు లంకించుకొంది.

బ్రతుకు జీవుడా అనుకొని ఆ మేకపోతు అక్కడి నుండి వెళ్ళి, తర్వాత అడవికి వచ్చిన మేకల మందలో కల్సి సాయంకాలానికి ఇంటికి చేరింది.

డాబు-డంబం రాయుళ్ళు ఒట్టి దర్పాన్ని ప్రదర్శించినపుడు అంతా డాబేనని అనటానికి ఈ పలుకుబడిని తరచూ ఉపయోగిస్తూ ఉంటాం.

*( శ్రీ పర్వతనేని గంగాధరరావుగారి రచన)*

*('సింగినాదం-జీలకర్ర' -బాలల అకాడమీ వారి ప్రచురణ)*

## అభ్యాసవేదిక

1. ఈ కింది పదాలకు అర్థాలు చెప్పించండి. రాయించండి.
   కాపరి – కావలికాసే మనిషి, గమనించు – పరిశీలించి చూచు, నివాసస్థలం – ఉండేచోటు, జంకు – భయం, ముంగిట – ముందుచోటు, బిడియం – సిగ్గు, ప్రతిజ్ఞ – ఒట్టు, దీక్ష – ఒకే విషయంపై మనస్సును కేంద్రీకరించుట, మోరగించు – ఎత్తి చూచు, దర్పం – గర్వం.
2. ఈ కింది ప్రశ్నలకు సమాధానాలు చెప్పించండి. రాయించండి.
   (i) కాపరి ఏ విషయాన్ని గమనించలేదు ?
   (ii) మేకపోతు ఆకారం ఎలా ఉంది ?
   (iii) సింహానికి భయం ఎందుకు కల్గింది ?
   (iv) మేకపోతు సింహాన్ని ఏమని గద్దించింది ?
   (v) మేకపోతు గాంభీర్యం అనే పలుకుబడిని ఎప్పుడు ఉపయోగిస్తాం ?
   (vi) మీరెపుడైనా దర్పాన్ని ప్రదర్శించారా? ప్రదర్శిస్తే అది ఎలాచేశారో చెప్పండి.
   (vii) గుండెల్లో గుబగుబలు కలుగుటెప్పుడు?
3. ఈ కింది పదాలను సొంత వాక్యాల్లో చెప్పించండి. రాయించండి.
   మిలమిలామెరియు, భయంవేయు, గుండెల్లో గుబగుబలు, గుప్పెట్లో పెట్టుకొను, దక్కించుకొను, గద్దించు, బిడియపడు, తడబడు, ప్రతిజ్ఞచేయు, పీడ వదిలించు.
4. ఈ కింది వాక్యాలలోని ఖాళీలను పాఠంలోని పదాలతో పూర్తిచేయండి.
   (i) మేత కోసమని మేకలమందను ________ అడవికి తోలుకెళ్తూ ఉండేవాడు.
   (ii) సింహం అలాగే గుహ ________ నిలబడింది.
   (iii) సింహం ________ బయటపడి ప్రాణాలు దక్కించుకొనుట ఎలాగ ?
   (iv) సింహం ________ పరుగు
5. మీ ప్రాంతంలో మేకపోతు గాంభీర్యం అన్న పలుకుబడిని ఉదాహరణగా ప్రచారంలోఉన్న మరొక కథను విద్యార్థులకు చెప్పండి. వారితో చెప్పించండి.
6. ఈ కింది పలుకుబడిని వివరించండి. మరికొన్ని పలుకుబళ్ళను రాయించండి.
   ఉదా : కాకతాళీయం.
7. ఈ కింది పదం వంటి అనుకరణ పదాలను మరికొన్ని చెప్పండి. రాయించండి.
   ఉదా : మిలమిలా.
8. ఈ కింది పదాలను ఉచ్చరించమనండి – ఉక్తలేఖనం చేయించండి.
   గాంభీర్యం, సింహం, అదృష్టం, ప్రతిజ్ఞ, దీక్ష

ధర్మో రక్షతి రక్షితః

— 0 —

# 3. తృప్తిని మించిన ఐశ్వర్యం ఏముంది ?

(ఎల్లప్పుడూ కలిగినదాంతో తృప్తిచెందాలని చెప్పడం ఈ పాఠం ఉద్దేశం.)

**ఈ పాఠంలోని కొత్త పదాలు :**

రాజభవనం, మురిసిపోవు, కూడబెట్టు, హఠాత్తుగా, ప్రత్యక్షం, కరిగిపోవు, నెరవేరు, పసిడి, అంతర్ధానం, వేకువ, ఉద్యానవనం, పుష్పాలు, కళకళలాడు, మురిసిపోవు, పానీయం, ద్రవం, జవురుకొను, ఆశ్చర్యం, విముక్తుడు, చెంపలువేసికొను, చిరునవ్వు, సాష్టాంగపడు, దురాశ, శిక్ష, ఉపసంహరించు, జాలిపడు, తథాస్తు, యథారీతి, హేతువు.

* * *

చాలాకాలం కిందట గ్రీసుదేశంలో మిడాస్ అనే రాజు ఉండేవాడు. అతడు గొప్ప ధనవంతుడు. అతని రాజభవనంలో ఒక పెద్ద గది నిండా బంగారం ఉండేది. కాని అతనికి తృప్తి ఉండేదికాదు. సంతోషమూ ఉండేది కాదు. ఇంకా బంగారం కూడబెట్టాలని ఆశ. ప్రతి రాత్రీ బంగారం దాచిన గదిలోకి పోయి బంగారాన్నంతా చూసుకుంటూ మురిసిపోయేవాడు.

అతడొక రోజు రాత్రి, రోజూలాగానే గదిలో బంగారాన్ని చూస్తూ " నా దగ్గర ఇంకా ఎక్కువ బంగారం ఉంటే ఎంత బాగుండేది ! ఇంకో గదిని కూడా ఆ బంగారంతో నింపేవాడిని కదా " అని మనసులో అనుకొన్నాడు. హఠాత్తుగా అతని ముందు ఒక దేవత ప్రత్యక్షమై ' మిడాస్ నీకేం కావాలి ?' అని అడిగింది. వెంటనే అతడు ' నేను తాకిన ప్రతిదీ బంగారం కావాలి ' అన్నాడు. ఇప్పటికే నీ దగ్గర కావాల్సినంత బంగారం ఉంది. ఇంకా ఏం చేసికొంటావ్ ? అని దేవత ప్రశ్నించింది. ఈ బంగారమేం సరిపోతుంది. కూర్చొని తింటే కొన్ని రోజుల్లోనే కరిగిపోతుంది. అందువల్ల మరింత బంగారంకోసం తాను తాకిందల్లా బంగారంగా మారాలని ఆ దేవతను వరం కోరాడు. సరే ' నీ కోరిక నెరవేరుతుంది. రేపు ఉదయంనుండి నీవు తాకిన ప్రతి వస్తువూ పసిడిగా మారుతుంది. ' అని దేవత అంతర్ధానమైంది.

మిడాస్ ఎంతో సంతోషించాడు. ఏయే వస్తువులను తాకి వాటిని బంగారంగా మార్చాలో ఆలోచిస్తూ ఆ రాత్రి గడిపాడు. మరునాడు వేకువనే నిద్రలేచి ఎప్పుడు పొద్దుపొడుస్తుందా అని ఎదురుచూస్తూ కూర్చున్నాడు. పొద్దుపొడవగానే తన పడకను మొదట తాకాడు. వెంటనే అది పసిడిగా మారిపోయింది. గదిలోని అనేక వస్తువులను తాకాడు. తాకిన ప్రతి వస్తువూ బంగారంగా మారిపోయింది. అతడు ఆశ్చర్యపడ్డాడు.

అతడు ఆనందంతో ఉద్యానవనంలోకి వెళ్ళాడు. తోటంతా అందమైన పుష్పాలతో కళకళలాడుతూ ఉంది. దేవత తన కిచ్చిన వరాన్ని మరచి వాటిని తాకాడు. వెంటనే అవి పసిడి పూలుగా మారిపోయాయి. 'సహజమైన పూలకంటె బంగారు పూలు ఎంత అందంగా ఉన్నాయి' అని మురిసిపోయాడు.



అతనికిఆకలివేసింది.భోజనాల గదిలోకి వెళ్ళాడు. సేవకులు రకరకాల ఆహార పదార్థాలూ పానీయాలూ తెచ్చిపెట్టారు. అతడు చేతిలోకి తీసికొన్న ప్రతి పదార్థం ..గారంగామారింది. పానీయాలూ బంగారు ద్రవాలుగా మారిపోయాయి.అతనికి బాధకల్గింది. అంతలో ముద్దుల కూతురు పరుగెత్తుతూ వచ్చి అతణ్ణి కౌగిలించుకొంది. అతడు ఆ పాపను జవురుకొని కౌగిలించుకున్నాడు.పాపం! ఆ పాప కూడా బంగారుబొమ్మ అయిపోయింది. ఈసారి అతని ఆశ్చర్యానికి దుఃఖం తోడైంది. తినడానికి తిండిలేదు.తాగడానికి నీరులేదు. తన ప్రియమైన కూతురూ బంగారై పోయింది. ఏది తాకినా బంగారమౌతోంది. దుఃఖించాడు. భయపడ్డాడు. "ఓ దేవతా ! నన్ను క్షమించు ! ఈ వరాన్ని వెనక్కు తీసికొని నన్ను ఈ బాధనుండి విముక్తుణ్ణిచెయ్యి" అని వేడుకొని చెంపలు వేసికొన్నాడు. దేవత చిరునవ్వుతో ప్రత్యక్షమై 'ఇంకా ఏం కావాలి మిడాస్' అంది.

బాలలూ ! దురాశ దుఃఖానికి హేతువుకదా !

## అభ్యాసవేదిక

1. ఈ కింది పదాలకు అర్థాలు చెప్పండి. రాయించండి.

మురిసిపోవు – సంతోషపడు, హఠాత్తుగా – ఒక్కసారిగా, ప్రత్యక్షం – కంటికి కనబడు, పసిడి – బంగారం, నెరవేరు – పూర్తియగు, అంతర్థానం – మరుగుపడు, మాయమగు, వేకువ – తెల్లవారుఝాము, పొద్దుపొడుచు – సూర్యుడు ఉదయించు, ఉద్యానవనం – తోట, పుష్పాలు – పూలు, సహజం – స్వభావసిద్ధం, పానీయం – త్రాగు ద్రవపదార్థం, జవురుకొను – ప్రేమతో దగ్గరికి తీసికొను, అమరుకొను, విముక్తుడు – వదలబడినవాడు, విడుదల అయినవాడు, సాష్టాంగపడు – శరీరం భూమిపై అను, క్షమించు– మన్నించు, ఉపసంహరించు – వెనక్కితీసికొను, తథాస్తు – అట్లే అగుగాక అని చెప్పు, యథారీతి – మునుపటివలె, ఆదరాబాదరా – తొందర తొందరగా, దురాశ – చెడ్డ ఆశ, హేతువు – కారణం.

2. ఈ కింది పదాలను సొంత వాక్యాలలో చెప్పించండి – ఆ వాక్యాలు రాయించండి.
కూడబెట్టు, మురిసిపోవు, ప్రత్యక్షమగు, కూర్చొని తిను, కరిగిపోవు, వరంకోరు, అంతర్థానమగు, ఎదురుచూచు, మారిపోవు, ఆశ్చర్యపడు, కళకళలాడు, బాధకల్గు, జవురుకొను, భయపడు, సాష్టాంగపడు.

3. ఈ కింది ప్రశ్నలకు జవాబులు చెప్పించండి. రాయించండి.

(i) మిడాస్ అనే రాజుకు ఏవి ఉండేవికావు ?
(ii) మిడాస్ ఎలా మురిసిపోయేవాడు ?
(iii) మిడాస్‌కు ఇంకా బంగారం కావాలనే కోరిక ఎందుకు కల్గింది ?
(iv) దేవత మిడాస్‌కు ఇచ్చిన వరం ఏమిటి ?
(v) మిడాస్ తాకగానే ఏవేవి బంగారంగా మారాయి ?
(vi) మిడాస్ దేవతను ఎందుకు వేడుకొన్నాడు ?
(vii) దేవత మిడాస్‌తో రెండోసారి ఏమంది ?
(viii) మిడాస్ చివరకు ఏమి అనుకొన్నాడు ?
(ix) దుఃఖానికి హేతువేది ?
(x) మిడాస్‌కు ఇచ్చిన వరం దేవత మీకు ఇస్తే మీరేం చేస్తారు ?

4. దురాశకు సంబంధించిన ఒకటి రెండు కథలు విద్యార్థులకు చెప్పండి. చెప్పించండి.
5. ఈ కింది ఒకే అర్థమున్న పదాలను ఒక చోట రాయించండి.

(i) ఆనందపడు – సంతోషపడు – మురిసిపోవు
(ii) గది – అఱ / అర – రూమ్

ఇలాంటివే మరికొన్ని పదాలను సేకరించమనండి. రాయమనండి.

6. మీ బడిలోని పదచిత్ర నిఘంటువు చూచి ఈ కింది పదానికి మరో రెండు పదాలు చెప్పండి. విద్యార్థులను మరికొన్ని పదాలు సేకరించమనండి.

(i) రాజు ______________ ______________

(ii) బంగారము______________ ______________

7. ఈ కింది పదాలలోని భేదాన్ని చెప్పండి. రాయించండి.

విద్య – అవిద్య, ఆరోగ్యం – అనారోగ్యం, సహజం – అసహజం, సమానత – అసమానత. ఇట్టివే మరికొన్ని పదాలను సేకరించి రాయమనండి.

8. ఈ కింది పదాలను ఉచ్చరించమనండి – ఉక్తలేఖనం చేయించండి.
గ్రీసుదేశం – రాజభవనం – ప్రత్యక్షం – హఠాత్తుగా – అంతర్ధానం – ఆశ్చర్యపడటం – ఆహారపదార్థం – దుఃఖించడం – క్షమించడం – సాష్టాంగపడటం.

9. ఈ పాఠంలోని నామవాచక పదాలను – సర్వనామ పదాలను పట్టికగా రాయండి. (వీటిని గురించి బాలబాలికలు మూడవ తరగతిలో తెలిసికొన్నారు)

10. 'తథాస్తు' అనే మాట ఏయే సందర్భాల్లో వాడుతారో చెప్పండి.

11. ఈ కింది కథా చిత్ర మాలికను చూచి కథను రాయించండి.



12. కొన్ని కథా చిత్రమాలికలను సేకరించి ఆల్బమ్‌లో అతికించమనండి. వీనికొరకు పిల్లల పత్రికల్లోని కత్తిరింపులు ఉపయోగించుకోవచ్చు.

గొంతెమ్మ కోర్కెలు కోరరాదు

— o —

# 4. బాలవీరుడు

(ఆపదలో ఉన్నవారిని ఆదుకొనే లక్షణం పెంపొందించడమే ఈ పాఠం ఉద్దేశం.)

**ఈ పాఠంలోని కొత్త పదాలు :**

ఆటవిడుపు, మాదిరి, సమీపం, ప్రవహించు, గెంతులేయు, ఒరిసి, అపాయం, శకించు, జారిపోవు, వేగం, రోదించు, పరుగు, సాహసం, రక్షించు, గుమిగూడు, కాళ్ళావేళ్ళాపడు, బతిమిలాడు, కేవలం, స్థానికం, నిండు ప్రాణం, జల సమాధి, ఖాయం, వలదు, వారించు, ఉదుటున, పాదరసంలా పనిచేయు, ప్రథమ చికిత్స, ఊపిరాడు, బయటపడు, అబ్బురపడు, ప్రశంస, వ్యాపించు, వేనోళ్ళపొగడు, అభినందన, సందేశం.

* * *

ఆ రోజు రెండవ శనివారం. పాఠశాలలకు సాధారణంగా సెలవురోజు. సెలవురోజంటే, చదువుకొనే పిల్లలకు ఆటవిడుపు కదా ! అందువల్లే చాలామంది పిల్లల మాదిరిగా అనిల్, అరుణ్, సందీప్, టింకూ అనే నలుగురూ సమీపంలోఉన్న కాలువగట్టుమీది ఖాళీస్థలంలో ఆడుకోవడానికి వెళ్ళారు.

ఆ కాలువ వరంగల్ పట్టణాన్ని అనుకొని ప్రవహిస్తోంది. దాన్ని కాకతీయ కాలువ అంటారు. ఈ కాలువ బ్యాంకు కాలనీకి దగ్గర్లో ఉంది. పిల్లలు నలుగురూ పదేండ్లలోపువారే. ఆడుతూ, పాడుతూ, నవ్వుతూ, తుళ్ళుతూ, గెంతులేస్తున్న అరుణ్ కాలిచెప్పు గట్టునొరిసి ప్రవహిస్తున్న కాలువలో పడింది. కాలిచెప్పు నీటిలోనుండి తీద్దాం అని అపాయాన్ని శంకించకుండా కాల్వలోకి దిగాడు అరుణ్. అంతే ! నీళ్ళలోకి జారిపోయాడు. కేకలేస్తూ, చేతులు చాపుతూ సాయం కోసం యేడ్చాడు కాల్వలో

కొట్టుకొనిపోతూ. ఇది చూచిన తోటి బాలుడు అనిల్ పరుగెత్తి తన చేయి అందించ ప్రయత్నించాడు. అంతే!! ఇద్దరూ లోతైన కాల్వలోకి జారిపోయారు. వారిద్దరికీ ఈదడం రాదు. ప్రవాహవేగానికి కొట్టుకొనిపోతూ ఉన్నారు.

దీన్నంతా గమనిస్తూ ఉన్న టింకూ భయంతో ఏడుస్తూ పరుగెత్తుకుంటూ దగ్గర్లోనే ఉన్న తన ఇంటికి పోయి వాళ్ళ అమ్మమ్మకు విషయం చెప్పాడు. ఆమె పెద్దగా రోదిస్తూ కాల్వగట్టుకు పరుగుతీసింది. ఇది చూచిన జనం పందలాదిగా పోగయ్యారు.

క్షణాలు గడుస్తున్నాయి. నీటిలో అరుణ్- అనిల్ మునుగుతూ తేలుతూ పోతున్నారు. కాల్వగట్టు మీది జనం ఎవరూ కూడా సాహసంచేసి వాళ్ళను రక్షిద్దామని ప్రయత్నించలేదు. వాళ్ల అమ్మమ్మ గుండెలు అవిసేలా అక్కడ గుమిగూడిన వారందర్నీ కాళ్ళావేళ్ళాపడి బతిమిలాడుతోంది, తన మనవళ్ళను రక్షించమని. ఎవరూ సాహసించలేదు.

ఆ క్షణంలో మీరైతే ఏంచేస్తారు ?





ఈ విషయం విని పరుగెత్తుకుంటూ అక్కడికి వచ్చిన ఆకుల శ్రీకాంత్ సాహసం చేశాడు. అతడు కేవలం పద్నాల్గు సంవత్సరాలవాడు.

స్థానిక స్కూలులో తొమ్మిదో తరగతి చదువుతున్నాడు. ఆలస్యం అయితే ఏందు ప్రాణాలు జలసమాధి అవడం ఖాయం. పెద్దవాళ్ళు వద్దని వారిస్తున్నా, కళ్ళద్దాలు కాల్వగట్టు మీద పడేసి బట్టలైనా విప్పకుండా ఒక్క ఉదుటున కాల్వలోకి దూకాడు. ఈదుకుంటూపోయి ముందుగా అవిల్‌ని ఒడ్డుకు చేర్చాడు. ఇక్కడే ఒక ఆలోచన పొరపాటుగా పనిచేసింది. ఇద్దర్నీ పట్టుకుంటే తాను కూడా మునిగిపోయే ప్రమాదం ఉండేది. మళ్ళీ ఈదుకుంటూ వెళ్ళి రెండో సారి అరుణ్‌ని లాక్కొచ్చాడు కాని అప్పటికే ఆలస్యమైంది. నీళ్ళు మింగిన అరుణ్ ప్రథమ చికిత్స చేసినప్పటికీ ఊపిరాడక ప్రాణం వదిలాడు. ముందుగా ఒడ్డు చేరిన అవిల్ ప్రాణాలతో బయటపడ్డాడు.

శ్రీకాంత్ సాహసానికి అందరూ అబ్బురపడ్డారు. ప్రశంసల వర్షం కురిపించారు. ఈ విషయం జిల్లా, రాష్ట్రం, దేశమంతటా జాతీయ స్థాయిలో పత్రికలూ ప్రశంసించాయి. భారత ప్రభుత్వం ఈ విషయాన్ని గుర్తించి ప్రతి సంవత్సరం ధైర్యసాహసాలు ప్రదర్శించే బాలబాలికలకు ఇచ్చే జాతీయ అవార్డు 1990 వ సంవత్సరానికి ఈ అబ్బాయికి ఇచ్చింది. రాష్ట్రం నలుమూలలనుండి శ్రీకాంత్‌కు అభినందన సందేశాలు అందాయి. ప్రధానమంత్రినుండి అవార్డును స్వీకరించిన శ్రీకాంత్ 1991 గణతంత్ర దినోత్సవంనాడు ఢిల్లీలో జరిగిన పెరేడ్‌లో ఏనుగుపై ఊరేగాడు

సాహస బాలుడైన శ్రీకాంత్‌ను కన్న తలిదండ్రులు లక్ష్మీకాంతమ్మ, సమ్మారావులు. వారు అదృష్టవంతులు. అభినందనీయులు.

బాలలూ ! మీరుకూడా అవసరం వచ్చినపుడు సాహసం ప్రదర్శిస్తారు గదూ !!

## అభ్యాసవేదిక

1. ఈ కింది పదాలకు అర్థాలు చెప్పండి. రాయించండి.

ఆటవిడుపు–విశ్రాంతి, ప్రవహించు–పారు, సమీపం–దగ్గర, ఒరిసి – రాసుకొ
శంకించు–సందేహించు, రోదించు–ఏడ్చు, పోగవు–గుమిగూడు,సాహసం– ధైర్య
రక్షించు – కాపాడు, గుండెలు అవియు – జాలి కలుగు, మనస్సు కరుగు, జ
సమాధి – నీటిలో సమాధి, ఖాయం – నిశ్చయం, తప్పనిసరి, ఉదుటున
ఒకే గంతులో, ప్రథమ చికిత్స – మొదటచేయు వైద్యం, ప్రమాదం
అపాయం, అబ్బురం – ఆశ్చర్యం, ప్రశంస – పొగడ్త, వ్యాపించు – విస్తరించ
పాకు, అభినందన – మెప్పు, స్వీకరించు – గ్రహించు, ప్రదర్శించు – చూప

2. ఈ కింది పదాలను సొంతవాక్యాలలో చెప్పించండి – రాయించండి.

ఆటవిడుపు, ఆడుతూ పాడుతూ, నవ్వుతూ తుళ్ళుతూ, గెంతులేయు
శంకించు, జారిపోవు, కొట్టుకొనిపోవు, పరుగుతీయు, ప్రయత్నించు
బతిమిలాడు, కాళ్ళావేళ్ళాపడు, బయటపడు, ఊపిరాడు, ప్రాణంవదలు
వేనోళ్ళపొగడు, ఊరేగు.

3. ఈ కింది ప్రశ్నలకు సమాధానాలు చెప్పించండి – రాయించండి.

(i) సెలవురోజుల్లో చాలామంది పిల్లలు ఏం చేస్తారు ?
(ii) పిల్లలిద్దరికీ ఈదడం రాకపోవడంవల్ల ఏం జరిగింది ?
(iii) ప్రజలు కాల్వలో దూకడానికి ఎందుకు సాహసించలేదు ?
(iv) శ్రీకాంత్ ఆలోచన ఎలా పనిచేసింది ?
(v) భారత ప్రభుత్వం శ్రీకాంత్‌ను ఎలా గుర్తించింది ?
(vi) అపాయకరమైన సమయాల్లో ప్రతి వ్యక్తి ఏంచేయాలి ?
(vii) శ్రీకాంత్ స్థలంలో మీరే ఉంటే ఏంచేసేవారు ?
(viii) మీకు ఈతరాదు. మీరొకరే అలాంటి చోట ఉన్నారు. అయితే ఏంచేస్తారు ?
(ix) ' నిండు ప్రాణాలు జలసమాధి అవటం ' అంటే ఏమిటి ?

4. ఈ కింది పదాల మొదట మరో పదం చెప్పించి కొత్త పదాలు రాయించండి.

ఉదా : <u>జాతీయ</u> స్థాయి

. . . . . . . . స్థాయి

. . . . . . . . స్థాయి

. . . . . . . . స్థాయి

ఇట్లు మరిన్ని ఇతర పదాలకు చెప్పండి.

5. సాహస బాలుర కిచ్చే జాతీయ అవార్డును ' బ్రేవరీ అవార్డు ' అంటారు.

ఇంతకు ముందుసంవత రాల్లో పై జాతీయ అవార్డు పొందినవారి పేర్లు కొన్నిటిని విద్యార్థులకు పాధ్యాయులు తెలియజేయాలి. ఒకరిద్దరు సాహస బాలురకు సంబంధించిన మాచారాన్ని సేకరింపజేయాలి. ఆ సాహస బాలుర సాహసాలను విద్యార్థులకు చెప్పాలి. వారి చిత్రాలను సేకరించమనాలి. అల్బమ్‌లో అతికించమనాలి.

6. ' ఆ రోజు రెండవ శనివారం '. ఇలాంటి మరికొన్ని వాక్యాలను రాయించండి.

7. ఈ కింది వాక్యాలను ఉదాహరణల్లో చూపిన విధంగా పూర్తిచేయించండి.

ఉదా : ఆటస్థలం బా కాలనీకి ఆనుకొని ఉంది.

(i) మా పాఠశాల __________ ఆనుకొని ఉంది.

(ii) మా మిత్రుని ఇల్లు __________ ఆనుకొని ఉంది.

(iii) మా ఇల్లు __________ ఆనుకొని ఉంది.

(iv) మా ఊరిలోని గ్రామపంచాయితి __________ ఆనుకొని ఉంది.

ఇట్లు మరికొన్ని వాక్యాలు రాయించండి.

8. ఈ కిందివానిని వివరించండి.

పాదరసం – జాతీయ అవార్డు – గణతంత్ర దినోత్సవం – ఆలోచన పాదరసంలా పనిచేయడం – ప్రథమ చికిత్స.

9. 'అవార్డు' అను పదం ఇంగ్లీషు పదం. విద్యార్థులకు తెలిసిన మరికొన్ని ఇంగ్లీషు పదాలు రాయమనండి.

10. ఈ కింది పదాలను ఉచ్చరించమనండి – ఉక్తలేఖనం చేయించండి.

శారీరం – బ్యాంకు కాలనీ – క్షణం – రక్షించడం – కళ్ళద్దాలు – ప్రథమ చికిత్స – ధైర్యసాహసాలు – ప్రదర్శించడం – గణతంత్ర దినోత్సవం.

11. ఈ కింది మాటలలోని లేఖనక్రమంలో ఉన్న భేదాన్ని గమనించమనండి.

కాల్వ – కాలువ. ఇట్టివే మరికొన్ని పదాలను సేకరించమనండి.

12. ఈ కింది వాక్యాంత చిహ్నాలను చూడండి.

బాలలూ ! కింది తరగతిలో ( . ) ఫుల్‌స్టాప్ ( , ) కామాల గురించి కొంత తెలుసుకొన్నారు గదా. ఇప్పుడు ఈ కింది చిహ్నాలనుకూడా గమనించండి.

'?' ఇది ప్రశ్న చిహ్నం.

ఏదైనా ప్రశ్న అడిగినప్పుడు రాసే ఆ ప్రశ్న వాక్యం చివర ఈ గుర్తు పెట్టాలి.

ఈ పాఠంలో బాలలూ ! మీరైతే ఏంచేస్తారు ? అనే వాక్యం చివర ఉన్న చిహ్నాన్ని ప్రశ్నచిహ్నం అంటారు.అట్లే ఈ పాఠంలో ఇతరచోట్ల ఉన్న ప్రశ్న చిహ్నాలను గుర్తించండి.

'!' ఇది ఆశ్చర్య చిహ్నం.

ఏదైనా ఒక విషయం ఇంతకుముందు వినవిది వింటే ఆశ్చర్యం కలుగుతుంది. అప్పుడు ఆ భావాన్ని తెలుపుతూ రాసే వాక్యం చివర (!) ఆశ్చర్య చిహ్నం పెడతారు.

ఈ పాఠంలో అపాయాన్ని శంకించకుండా కాల్వలోకి దిగాడు అరుణ్, అంతే ! అనే వాక్యం చివర ఆశ్చర్య చిహ్నం (!) ఉంది.

అట్లే ఈ పాఠంలో ఇతరచోట్ల ఉన్న ఆశ్చర్య చిహ్నాలను గుర్తించండి.

13. ఉపాధ్యాయులకు సూచన :

విద్యార్థులు ప్రతినిత్యం చదివే పత్రికలనుండి, చిన్న నవ్విదేశాలనుండి ఈ చిహ్నాలున్న వాక్యాలను రాయమనండి.

సత్యం వద, ధర్మం చర

— 0 —

# 5. కష్ట నష్టాలు

(గ్రామాల్లో నివసించి వ్యవసాయంచేస్తేనే సుఖసంతోషాలుంటాయిని చెప్పడం ఈ పాఠం ఉద్దేశం.)

**ఈ పాఠంలోని కొత్త పదాలు :**

మోతుబరి, ఏకైక, అప్పగించు, విశ్రాంతి, లాభసాటి, అతివృష్టి అనావృష్టి బూడిదపాలు, నివ్వెరపోవు, ఉద్దేశం, ప్రముఖుడు, నిట్టూర్చు, రొంపి, వ్యాపారస్థులు, జాస్తి, విముఖత, కొలువు, ఉద్యోగం, కత్తి మీదసాము, ఆత్మాభిమానం, నౌకరీ, తెలివితేటలు, ముఖంవేలాడేయు, అనుభవం, అచ్చంగా, ఆత్మస్థైర్యం, జయించు, సమర్థుడు, కుదుటపడు.

*   *   *

రామనాథం ఆ ఊళ్ళో మోతుబరి రైతు. అతని ఏకైక పుత్రుడు సోమనాథం. అతడు పెద్ద చదువులు చదివి ఇంటికి తిరిగి వచ్చాడు. తాను చేస్తున్న వ్యవసాయం తన కొడుక్కి అప్పగించి తాను విశ్రాంతి తీసికొందామనుకొన్నాడు రామనాథం.



కాని సోమనాథానికి వ్యవసాయం చేయాలని లేదు. అతడు తన తండ్రితో " వ్యవసాయం అంతగా లాభసాటి కాదు. కష్టపడినందుకు తగిన ఫలితం ఉంటుందను కోవటానికి వీలులేదు. అతివృష్టి అనావృష్టి ఏర్పడి చేసిన శ్రమ అంతా బూడిదపాలు కావచ్చు " అన్నాడు.

కొడుకు మాటలకు నివ్వెరపోయి రామనాథం " అయితే ఏం చేయాలని నీ ఉద్దేశం ? ఆ విధంగానే చేయి " అని అన్నాడు.



సోమనాథం ఆ ఊళ్ళోనే లక్షలమీద వ్యాపారం చేస్తున్న ఓ ప్రముఖుణ్ణి కలిసికొని " ఏ విధమైన వ్యాపారం లాభసాటిగా ఉంటుందంటారు " అని అడిగాడు.

ఆ వ్యాపారి నిట్టూర్చి, " ఏం వ్యాపారం నాయనా ! చదువుకున్న వాడివి. చూస్తూ చూస్తూ ఈ రొంపిలో ఎందుకు దిగుతావు ? వ్యాపారం వెనుకటంత లాభసాటిగా ఉండటంలేదు. వ్యాపారస్థులు జాస్తి అయ్యారు. పోటీ హెచ్చింది. వ్యాపారం చేసేవాడికి సుఖం లేదు. శాంతి లేదు. " అన్నాడు.



వ్యాపారంలోని కష్టనష్టాలను గురించి వివరంగా విన్న తర్వాత సోమనాథానికి వ్యాపారంమీద విముఖత పుట్టింది. అతను అక్కడి నుండి నేరుగా నగరానికి వెళ్ళి అక్కడ ఒక పెద్ద ప్రభుత్వోద్యోగిని కలిసికొని తన విషయమంతా చెప్పి ఏదైనా ఒక ఉద్యోగం ఇప్పించమన్నాడు. "ఎందుకు నాయనా! కొలువు చేస్తానంటున్నావ్. ఉద్యోగం చేయడమంటే కత్తిమీద సామే ! యజమానికి ఆగ్రహం కల్గినా, అనుగ్రహం కల్గినా ప్రమాదమే. ఆత్మాభిమానం చంపుకొని నౌకరీ చేయాలి. ఎంతచేస్తే మాత్రం ఊరా ? పేరా ? చదువుకొన్నావ్, తెలివితేటలున్నాయ్. భూములున్నా యంటున్నావ్. నీ తెలివితేటలు వ్యవసాయంలో చూపావంటే నీవింత తిని పదిమందికి ఇంత కూడు పెట్టగలుగుతావు. ఈ ఉద్యోగాల బ్రతుకులు చాలీ చాలనివి. ఇంతా చేసి ఉద్యోగం దొరకాలంటే మాటలు కాదు."

ఆ ఉద్యోగి చెప్పిన మాటల్లో నిజం ఉందని సోమనాథానికి తోచింది. ఇంటికి తిరిగి వచ్చాడు. ముఖం వేలాడేసుకొని వచ్చిన కొడుకును చూచి రామనాథం విషయం తెల్సికొని ఇలా అన్నాడు.

" నీ వాక్కు వ్యవసాయంలోనే కష్టనష్టాలున్నాయనుకొన్నావు నాయనా ! అది నీ తప్పు కాదు. నీకు వ్యవసాయం గురించి ఏమాత్రం అనుభవం ఉంది ? వాస్తవం ఏమంటే ఎక్కడ లాభమనేది ఉంటుందో అక్కడ కాస్తో-కూస్తో నష్టంకూడా ఉంటుంది. పూర్తి సుఖంతో కూడి అచ్చంగా లాభమే ఇచ్చే పని ఎక్కడా ఉండదు. జీవితంలో కష్టనష్టాలు అడుగడుగునా ఉంటాయి. మనిషికి కావాల్సింది దీక్షా, ఆత్మ స్థైర్యమూనూ. ఇవి ఉంటే ఎన్ని కష్టనష్టాలెదురైనా వాటిని ఎదుర్కొని జయించవచ్చు " అన్నాడు.



తండ్రి మాటలతో సోమనాథం మనస్సు కుదుటపడింది. అతను వ్యవసాయమే చేసి సమర్థు డనిపించుకొన్నాడు.

(శ్రీ గంగిశెట్టి శివకుమార్ గారిరచన)
(యథా రాజా తథా ప్రజా - బాలల అకాడమీ ప్రచురణ)

### అభ్యాసవేదిక

**ఉపాధ్యాయులకు సూచనలు :**

1. ఈ కింది పదాలకు అర్థాలు చెప్పండి. రాయించండి.
   మోతుబరి - మంచిస్థితి, ఏకైక - ఒకే ఒక, అతివృష్టి - ఎక్కువ వానలుపడుట, అనావృష్టి-తక్కువ వానలు లేక వానలు లేకపోవటం, నివ్వెరపోవు - ఆశ్చర్యపడు, ప్రముఖుడు - గొప్పవాడు, రొంపి - బురద, విముఖత - ఒప్పుకోకపోవటం, ఆగ్రహం - కోపం (పట్టుదల), ఆత్మాభిమానం - సొంత గౌరవం, అనుగ్రహం - దయ,ఆదరం, వాస్తవం - నిజం, ఆత్మస్థైర్యం - గుండెబలం, సమర్థుడు - నేర్పరి.

2. ఈ కింది పదాలను సొంతవాక్యాల్లో చెప్పించండి - రాయించండి.

అప్పగించు - లాభసాటి - బూడిదపాలు - నివ్వెరపోవు - రొంపిలో దిగు - పోటీ హెచ్చు - కష్టనష్టాలు - కొలువుచేయు - కత్తి మీద సాము - కూడుపెట్టు - అచ్చంగా - అడుగడుగునా - ఎదుర్కొను - కుదుటపడు - ముఖంవేలాడేసి.

3. ఈ కింది ప్రశ్నలకు సమాధానాలు చెప్పించండి. రాయించండి.

(i) రామనాథం ఏం చేద్దామనుకున్నాడు ?

(ii) సోమనాథం తండ్రితో ఏమని చెప్పాడు ?

(iii) సోమనాథానికి వ్యాపారి ఏం చెప్పాడు ?

(iv) సోమనాథానికి ఉద్యోగి ఏం సలహా ఇచ్చాడు ?

(v) సోమనాథం మొదట ఏయే వృత్తులు లాభసాటిగా ఉంటాయను కొన్నాడు?

(vi) సోమనాథం ఇంటికి ఎలా తిరిగివచ్చాడు ?

(vii) కష్టనష్టాలను ఎలా ఎదిరించవచ్చని రామనాథం అన్నాడు ?

(viii) చివరకు సోమనాథం ఏం నిర్ణయించుకొన్నాడు ?

(ix) చదువుల్లో సమర్థుడనిపించుకోవాలంటే మీరేం చేస్తారు ?

(x) మీకు ఏ వృత్తి అంటే ఇష్టం ? కారణమేంటి ?

4. ఈ కింది పదాలను ఉచ్చరించమనండి - ఉక్తలేఖనం చేయించండి.

అతివృష్టి- అనావృష్టి - ప్రముఖుడు - వ్యాపారస్థులు - ప్రభుత్వ ఉద్యోగి - ఆత్మాభిమానం - కష్టనష్టాలు - ఆత్మస్థైర్యం - సమర్థుడు.

5. ఈ కింది వాక్యాలలోని ఖాళీలను మీ పుస్తకంలోని పదాలతో పూర్తిచేయించండి.

(i) రామనాథం ఆ ఊళ్ళో __________ రైతు.

(ii) రామనాథం __________ పుత్రుడు సోమనాథం.

(iii) కొడుకు మాటలకు రామనాథం __________.

(iv) వ్యాపారం చేసేవాడికి __________ లేదు.

(v) ఉద్యోగాల బ్రతుకులు __________

6. ఈ కింది వాక్యం ఆధారంగా మరిన్ని వాక్యాలు అలాంటివే చెప్పించండి - రాయించండి.

ఉదా : నీకు వ్యవసాయంలో ఏమాత్రం <u>అనుభవం</u> ఉంది.

(i)

(ii)
(iii)

(iv)
(v)


7. పట్టణాలకు వలస వెళ్ళటం - గ్రామాల్ని వదిలివెళ్ళడం అనే విషయంలోని కష్టనష్టాలను వివరించండి.

8. ఈ పాఠంలో ప్రశ్నచిహ్నాలు - ఆశ్చర్యచిహ్నాలు ఏ వాక్యాల చివర ఉన్నాయో ఆ వాక్యాలను రాయమనండి.

9. బాలలూ ! కింది తరగతుల్లో మీరు ' నామవాచకం, సర్వనామం ' అంటే ఏమిటో తెలిసికొన్నారు. ఇప్పుడు ఈ కింది వాక్యాలు చూడండి.

(i) రాముడు <u>మంచి</u> బాలుడు.

(ii) పాలు <u>తెల్లగా</u> ఉంటాయి.

(iii) గేదెలు <u>నల్లగా</u> ఉన్నాయి.

పై వాక్యాల్లో మంచి, తెల్లగా, నల్లగా అనే పదాలు రాముడు, పాలు, గేదెలు అనే నామవాచక పదాలని వివరించి చెప్తున్నాయి. అందువల్ల ఈ పదాలను విశేషణాలంటారు. ప్రస్తుత పాఠంలోని విశేషణాలను పట్టికగా రాయించండి.

10. ఈ కింది పదాలు చూడండి.

విముఖత - సుముఖత.

ఈ పదాల అర్థంలో ఉన్న మార్పును గమనించండి.

మరికొన్ని ఇట్టి అర్థభేదం ఉన్న పదాలను చెప్పండి.

బ్రతుకుటకు తినవలెను. తినుటకు బ్రతుకరాదు

——— o ———

# 6. వీరేశలింగం పంతులు

(సంఘంలోని మూఢాచారాలను నిర్మూలించడానికి బాలబాలికలు పూనుకోవాలని ఈ పాఠం ఉద్దేశం.)

**ఈ పాఠంలోని కొత్త పదాలు :**

జన్మించు, ప్రథముడు, మెచ్చుకొను, క్రమశిక్షణ, పెంపుదల, కృషిచేయు, అభివృద్ధిచెందు, స్థాపించు, పరోపకారం, చిత్తశుద్ధి, శీలం, సత్ప్రవర్తన, అలవరచు, పాటుపడు, కాయకష్టం, అంటరానితనం, మూఢనమ్మకాలు, బాల్యవివాహాలు, మత్తుపానీయాలు, దురాచారాలు, నడుంకట్టు, సంస్కరణ, బారినపడు, వితంతువులు, పునర్వివాహం, ఖండించు, అధికం, ప్రాధాన్యం, ప్రయోజనం, బోధించు, స్వేచ్ఛ, ప్రబోధించు, వృథాచేయు, ఉత్తేజం, కృషిచేయు, మార్గదర్శకులు, అగ్రగణ్యులు, అపార్థాలు, అవహేళనలు, మహోన్నతం, అభ్యుదయవాది, ప్రాతఃస్మరణీయులు.

* * *



కందుకూరు వీరేశలింగం పంతులుగారు రాజమండ్రిలో జన్మించారు. ఆయన తల్లిదండ్రులు పున్నమ్మ, సుబ్బారాయుడు గారలు. చిన్నప్పటి నుండి ఆయన చదువుల్లో, ఆటల్లో ప్రథముడుగా ఉండేవారు. అందువల్ల ఉపాధ్యాయులు ఆయన్ను మెచ్చుకొనేవారు. తోటి విద్యార్థులు సైతం అప్పుడప్పుడూ తమకు తెలియని పాఠాలు ఆయనచేత చెప్పించుకొనేవారు.

విద్యాభ్యాసం పూర్తి ఐన తర్వాత పాఠశాలలో ఉపాధ్యాయులుగా చేరారు. ఆ కాలంలో విద్యార్థుల్లో క్రమశిక్షణ పెంపుదలకు కృషిచేశారు. స్త్రీలు చదువుకొంటేగాని సమాజం అభివృద్ధిచెందదనే భావంతో బాలికల కోసం పాఠశాలను స్థాపించారు. విద్యార్థుల్లో ధర్మం, దయ, నీతి, పరోపకారం, చిత్తశుద్ధి, శీలం, సత్ప్రవర్తన అలవరచడానికి పాటుపడ్డారు.

ఆ కాలంలో చదువుకొన్న వారి సంఖ్య చాలా తక్కువ. కాయకష్టంచేసి వ్యవసాయాది వృత్తులు చేసేవారే ఎక్కువ. ప్రజల్లో అమాయకత్వం కూడా ఎక్కువగా ఉండేది. అంటరానితనం, మూఢ నమ్మకాలు, బాల్యవివాహాలు, మత్తుపానీయాల వాడకం మొదలైన దురాచారాలు సమాజంలో భాగాలయ్యాయి. ఇలాంటి దురాచారాలనన్నిటినీ ఎదిరించి సమాజ సంస్కరణకు నడుంకట్టారు. బాల్య వివాహాలను నిరసించారు. ఈ బాల్య వివాహాల బారినపడి వితంతువులైన స్త్రీలకు పునర్వివాహాలు చేయించడానికి పూనుకున్నారు.

వీరేశలింగంగారు ఎన్నో పుస్తకాలు రాశారు. వారు రాసిన పుస్తకాలలో కవులచరిత్ర, రాజశేఖరచరిత్ర, ప్రహసనాలు మొదలైనవి ముఖ్యమైనవి. వారు వివేకవర్ధని మొదలైన పత్రికలను కూడా నడిపారు. వారి పుస్తకాలు, పత్రికలు అన్నీ సమాజంలోని దురాచారాలను ఖండించడానికీ, సంస్కరణల ప్రచారానికీ, అధిక ప్రాధాన్యం ఇచ్చాయి.

'నూరు మాటలు చెప్పేకంటే ఒక మంచిపని చేసి చూపటం అధిక ప్రయోజనం కల్గిస్తుంది.' అని వారు పదే పదే బోధించారు. స్వయంగా ఆచరించారు గూడా. జనుల్లో విద్య వ్యాపించాలనీ, ప్రజలు తమ హక్కులను గూర్చి తాము తెలిసికోవాలనీ, స్వేచ్ఛగా బ్రతకాలనీ ప్రబోధించారు. ఆయన తాను మరణించేవరకూ క్షణంగూడా కాలం వృధాచేయలేదు. తన జాతి జనులకు మేలు కలిగించే, ఉత్తేజం కలిగించే, పనులను చేస్తూనే వచ్చారు. సంఘంలో మార్పుల కోసం కృషిచేసిన తొలినాటి మార్గదర్శకులలో

వీరేశలింగంగారు అగ్రగణ్యులు. ఆయన కూడా అందరు సంస్కర్తల వలెనే అపార్థాలకు, అవహేళనలకు గురయ్యారు. అయినా వానిని అన్నిటినీ ధైర్యంగా ఎదిరించి నిల్చిన మహోన్నత వ్యక్తి పంతులుగారు. ఆయన గొప్ప అభ్యుదయవాది. సాహితీవేత్త, సంఘ సంస్కర్త. ' రావ్ బహదూర్', ' గద్య తిక్కన ' అనే బిరుదులు పొందారు. మన తెలుగువారికి ఆయన ప్రాతఃస్మరణీయులు.

## అభ్యాసవేదిక

1. ఈ కింది పదాలకు అర్థాలు చెప్పండి. రాయించండి.

   జన్మించు - పుట్టు, ప్రథముడు - మొదటివాడు, విద్యాభ్యాసం - చదువుకోవడం, క్రమశిక్షణ - వినయవిధేయతలు కలిగించుట, పెంపుదల - పెరుగుదల, కృషిచేయు - వ్యవసాయంచేయు, ప్రయత్నంచేయు, భావం - అభిప్రాయం, పరోపకారం - ఇతరులకు ఉపకారం, చిత్తశుద్ధి - మనస్ఫూర్తిగా, సత్ప్రవర్తన - మంచినడవడి, అలవరచు - అలవాటుచేయు, పాటుపడు - కృషిచేయు, వ్యవసాయాది వృత్తులు - వ్యవసాయం మొదలైన పనులు, మూఢనమ్మకం - గుడ్డిగానమ్మడం, బాల్యవివాహం - చిన్నతనంలోనే పెళ్ళి, మత్తుపానీయాలు - మత్తు కలిగించే ద్రవాలు (కల్లు, సారాయి వంటివి), దురాచారం - చెడ్డ ఆచారం (అలవాటు), వితంతువు - భర్త చనిపోయిన స్త్రీ విరసించు - ఖండించు, పునర్వివాహం - తిరిగి పెళ్ళి, పూనుకొను - నడుంకట్టు, అధికం - ఎక్కువ, మిక్కిలి, ప్రాధాన్యం - మొదటిస్థానం, ప్రయోజనం - లాభం, స్వేచ్ఛ - స్వాతంత్ర్యం, ప్రబోధించు - చాటిచెప్పు, ఉత్తేజం-ఉత్సాహం, మార్గదర్శకులు-తోవచూపినవారు,తొలినాడు - మొదటిరోజు, అగ్రగణ్యులు - ముందు లెక్కింపదగినవారు, అపార్థం - తప్పు అర్థం, అవహేళనలు - వెక్కిరింపులు,మహోన్నతం-గొప్పది, అభ్యుదయం - ప్రగతి, ప్రాతఃస్మరణీయులు - ఉదయమే జ్ఞప్తికి తెచ్చుకొనవలసినవారు.

2. ఈ కింది ప్రశ్నలకు సమాధానాలు చెప్పించండి - రాయించండి.

(i) వీరేశలింగంగారు ఎచ్చట జన్మించారు ?

(ii) ఉపాధ్యాయులు ఆయన్ను ఎందుకు మెచ్చుకొనేవారు ?

(iii) మిమ్మల్ని ఎపుడైనా మీ ఉపాధ్యాయుడు మెచ్చుకొన్నాడా ? మెచ్చుకొంటే ఆ సన్నివేశమేంటి ?

(iv) తోటి విద్యార్థులేం చేసేవారు ?

(v) ఉపాధ్యాయులుగా ఉన్నప్పుడు వీరేశలింగం ఏం చేశారు ?

(vi) స్త్రీల చదువు గురించి వారి అభిప్రాయం ఏమిటి ?

(vii) పంతులుగారి కాలంలో సమాజ పరిస్థితులెలా ఉండేవి ?

(viii) వీరేశలింగంగారు రాసిన పుస్తకాలేవి ? నడిపిన పత్రిక ఏది ?

(ix) వారి రచనలలో అధిక ప్రాధాన్యత ఏ అంశానికి ఇవ్వబడింది ?

(x) వారు పదే పదే ఏమని బోధించారు ?

(xi) వారు మరణించేవరకూ కాలం ఎలా గడిపారు ?

(xii) వీరేశలింగంగారు వేటిని ధైర్యంగా ఎదిరించారు ?

(xiii) ఆయన బిరుదములేవి ?

(xiv) కాలాన్ని ఎందులకు వృథా చేయరాదు ? నీవు కాలాన్ని ఎలా వినియోగిస్తావు ?

(xv) నేటి సమాజంలోని దురాచారాలేవి ? వానిని ఎలా ఎదిరించాలి ?

3. ఈ కింది వాక్యాల్లోని ఖాళీలను ఈ పాఠం ఆధారంగా పూర్తిచేయించండి.

(i) వీరేశలింగం తల్లిదండ్రులు ____________ గారలు.

(ii) ఉపాధ్యాయులు ఆయన్ను ____________ .

(iii) విద్యార్థుల్లో ____________ పెంపుదలకు కృషిచేసారు.

(iv) వితంతువులైన స్త్రీలకు ____________ చేయించడానికి పూనుకొన్నారు.

(v) నూరుమాటలు ____________ ఒక మంచిపని ____________ అధిక ____________ కల్గిస్తుంది.

4. ఈ కింది పదాలను సొంతవాక్యాలలో చెప్పించండి. రాయించండి.

జన్మించు– ప్రథముడుగాఉండు – మెచ్చుకొను – చెప్పించుకొను – కృషిచేయు – స్థాపించు – అలవడు – పాటుపడు – ఎదిరించు – నడుంకట్టు – నిరసించు – బారినపడు – పూనుకొను – ఖండించు – ప్రాధాన్యం ఇచ్చు – బోధించు – వ్యాపించు – ప్రబోధించు – కాలం వృథాచేయు – ఉత్తేజం కలిగించు – మార్గదర్శనం – అపార్థం – అవహేళన – ఎదిరించి నిలుచు – ప్రాతఃస్మరణీయులు.

5. ఈ కింది పదాలను వివరించండి.

క్రమశిక్షణ – బాల్యవివాహాలు – మత్తుపానీయాలు – మూఢనమ్మకాలు – పునర్వివాహం – హక్కులు – స్వేచ్ఛ – అగ్రగణ్యులు – రావ్ బహదూర్ – గద్య తిక్కన – అభ్యుదయవాది – సాహితీవేత్త – సంఘసంస్కర్త.

6. ఈ కింది పదాల గురించి చెప్పండి. వాటి భావాన్ని విద్యార్థుల ప్రవర్తనల్లో కనబడేట్లు చూడండి.

ధర్మం – దయ – నీతి – పరోపకారం – చిత్తశుద్ధి – శీలం – సత్ప్రవర్తన – కాయకష్టం.

7. ఈ మాదిరి వాక్యం ఆధారంగా మరో ఐదు వాక్యాలు రాయించండి.

ఉదా : సంఘంలో మార్పుల కోసం కృషిచేసినవారిలో వీరేశలింగంగారు <u>అగ్రగణ్యులు.</u>

స్థానికంగా విద్యారంగంలో కృషిచేసినవారిలో __________ అగ్రగణ్యులు.

దేశస్వాతంత్ర్యంకోసం కృషిచేసినవారిలో __________ అగ్రగణ్యులు.

8. అపార్థాలు – అవహేళనలకు మనిషి గురయ్యే సన్నివేశాలను చెప్పండి. విద్యార్థులు ఇలాంటి సన్నివేశాలకు గురికావద్దని చెప్పండి.

9. కొంతమంది సాహితీవేత్తల పేర్లు, సంఘసంస్కర్తల పేర్లు చెప్పి వారి చిత్రాలు సేకరించి ఆల్బమ్ తయారుచేయించండి.

10. విద్యార్థులు ధైర్యంగా నిలిచిన సన్నివేశాలేమైనా ఉంటే చెప్పించండి. వారి స్నేహితుల్లో ఎవరైనా ధైర్యసాహసాలు ప్రదర్శిస్తే వారి గురించి చెప్పమనండి.

—

11. ఈ కింది పదాలను ఉక్తలేఖనం చేయించండి.

విద్యాభ్యాసం - క్రమశిక్షణ - చిత్తశుద్ధి - సత్ప్రవర్తన - బాల్యవివాహం - పునర్వివాహం - విద్యావ్యాప్తి - స్వేచ్ఛ - ఉత్తేజం - మార్గదర్శకులు - సాహితీవేత్త - సంఘసంస్కర్త.

12. ఈ కింది పదం చూడండి.

ఉదా : ప్రాతఃస్మరణీయుల్లు.

ఈ పదంలో (ః) గుర్తు చూసారా ! ఈ గుర్తును విసర్గ అంటారు. సంస్కృత పదాల్లో మాత్రమే ఈ విసర్గ కనబడుతుంది.

ఈ విసర్గ (ః) ఉచ్చారణను విద్యార్థులకు చెప్పండి :

కింది పదాలు చెప్పి రాయించండి. ఉచ్చరింపజేయండి.

ఉదా : ప్రాతఃకాలం తపఃఫలం తేజఃపుంజం నమఃశివాయ
మనఃఖేదం పయఃపానం అంతఃపురం

ఇట్టివే మరికొన్ని పదాలు సేకరించి చెప్పండి. విద్యార్థుల్ని మరికొన్ని సేకరించమనండి.

13. ఈ కింది పదాలు - కలిపి రాసినపుడు వచ్చిన మార్పులను గమనింపమనండి.

| | | |
|---|---|---|
| ఉదా : | తల్లి - తండ్రి | - తల్లిదండ్రులు |
| | అక్క - చెల్లి | - . . . . . |
| | అన్న - తమ్ముడు | - . . . . . |

ఇట్టివే మరికొన్ని పదాలను సేకరించి రాయమనండి.

## వినయ విధేయతలు మహాత్ముల లక్షణం

— o —

# 7. రుద్రమదేవి

(స్త్రీలు సమాజంలో అత్యున్నత వ్యక్తులు. వారిని గౌరవించాలనే భావన పెంపొందించడం ఈ పాఠం ఉద్దేశం.)

**ఈ పాఠంలోని కొత్త పదాలు :**

ఉర్వి, ప్రతిభ, ప్రదర్శించు, సందర్భం, కోకొల్లలు, కదనరంగం, మధురం, దర్శనమిచ్చు, తలమానికం, చనువు,చెంత, నిశితం, పరిశీలించు, యుద్ధవిద్యలు, ఆరితేరు, భావించు, తిరుగుబాటు, విశ్వాసపాత్రులు, ఏకంచేయు, సుస్థిరం, అలజడి, ప్రజాశ్రేయస్సు, నడుంకట్టు, జాతీయభావం, సమైక్యం, దేశాభిమానం, అన్నదాత, కరువుకాటకాలు, ఈతిబాధలు, ఆదరాభిమానాలు, ఆదర్శం, సామ్రాజ్ఞి, వర్తకుడు, నిలయం, ప్రజానురంజనం, పరమావధి, పరిపాలకులు, ఆదర్శప్రాయురాలు, నిత్యస్మరణీయురాలు.

* * *

ఊయలను ఊపేచేయి ఉర్విని కూడా పాలించగలదు. స్త్రీలుకూడా పురుషులతో సమానంగా అన్ని రంగాల్లో తమ ప్రతిభను ప్రదర్శించిన సందర్భాలు మన చరిత్రలో కోకొల్లలు. కత్తిబట్టి కదన రంగంలో దూకిన స్త్రీలూ, కలం పట్టి కవిత్వం చెప్పినవారూ, రాళ్ళు సైతం కరిగేట్లు మధురంగా పాడగలిగేవారూ మన సమాజంలో దర్శనమిస్తారు. మన చరిత్రలో వీరనారులు ఎందరో ఉన్నారు. వారిలో తలమానికం రుద్రమదేవి.



రుద్రమ,కాకతీయసామ్రాజ్యాన్ని ఏలిన గణపతిదేవ చక్రవర్తి కుమార్తె. చిన్ననాటినుండి

చనువుగా తండ్రి చెంత కూర్చొని రాజ్యపాలనను నిశితంగా పరిశీలిస్తూ ఉండేది. తండ్రి ఆమెను కొడుకువలె పెంచాడు. యుద్ధవిద్యల్లో శిక్షణ ఇప్పించాడు. ఆమె అన్ని విద్యల్లోనూ ఆరితేరింది.

గణపతిదేవుని మరణం తర్వాత రుద్రమ రాజ్యాన్ని చేపట్టింది. స్త్రీయని భావించిన సామంతులు తిరుగుబాటు చేశారు. విశ్వాసపాత్రులైన సేనాపతుల సాయంతో ఆమె తిరుగుబాటుదారులను అందర్నీ ఓడించింది. తెలుగునేలను ఏకంచేసి కాకతీయ సామ్రాజ్యాన్ని సుస్థిరం చేసింది.

రాజ్యంలో అలజడులు తగ్గిన తర్వాత ప్రజాశ్రేయస్సు వైపు దృష్టి మరల్చింది. ప్రజలకు రాజులయెడ గౌరవం కలిగించేట్లు పరిపాలన చేయడానికి నడుంకట్టింది. ప్రజల్లో జాతీయభావాన్ని, సమైక్యతనూ దేశాభిమానాన్నీ పెంపొందించాల్సిన అవసరాన్ని గుర్తించింది. పల్లెల్లో నివసించే రైతులే దేశానికి అన్నదాతలని నమ్మింది. వారు క్షేమంగా ఉంటే రాజ్యంలోకరువుకాటకాలుండవని వ్యవసాయం కోసం నీటివనరులు అభివృద్ధి పరిచింది. అన్నసత్రాలు, వైద్యశాలలు స్థాపించింది.

కన్న తల్లివలె, కనురెప్పలవలె, రక్షించే రుద్రమదేవి పాలనలో, ప్రజలు ఈతిబాధలు ఎరుగరు. వారికి భయాలూ బాధలూ లేకుండా చేసిన ప్రజాసేవాభిమాని రుద్రమ. ప్రజల ఆదరాభిమానాలను చూరగొన్న ఆదర్శ సామ్రాజ్ఞి రుద్రమ.

ఆమె కాలంలో మార్కోపోలో అనే వెనిస్ వర్తకుడు మన దేశానికి వచ్చాడు. అతడు ' రుద్రమదేవి పాలన శాంతికి, దయకు, న్యాయానికి, ధర్మానికి నిలయంగా ఉండేదని, ప్రజలకు రుద్రమ అంటే అమితమైన భక్తి' అని రాశాడు. ప్రజానురంజనమే పరమావధిగా, ప్రజారక్షణయే ఆదర్శంగా, ప్రజల సౌకర్యమే పరమధర్మంగా పవిత్రపాలన సాగించిన రుద్రమ పరిపాలకులకు ఆదర్శప్రాయురాలు. ప్రజలకు నిత్యస్మరణీయురాలు.

## అభ్యాసవేదిక

1. ఈ కింది పదాలకు అర్థాలు చెప్పండి - రాయించండి.

ఉర్వి–నేల, భూమి; ప్రతిభ–అప్పటికప్పుడు వికసించే బుద్ధి; సందర్భం– సమయం; కోకొల్లలు – లెక్కకు మిక్కిలి; కదనరంగం – యుద్ధభూమి; మధురం – తీపి, తీయన; దర్శన మిచ్చు – కంటికి కనబడు; తలమానికం – శ్రేష్ఠమైన; నిశితంగా – లోతుగా, సూక్ష్మదృష్టితో; ఆరితేరు – సమర్థుడగు; భావించు – అభిప్రాయపడు; తిరుగుబాటు – అధికారమునకు ఎదురుతిరుగు; విశ్వాసపాత్రులు – నమ్మకస్థులు; అలజడి– ఆపద; ప్రజాశ్రేయస్సు – ప్రజలమేలు; సమైక్యం– కలిసిమెలిసియుండు; అన్నదాత – ఆహారం ఇచ్చే వ్యక్తి; ఈతిబాధలు – కరువు బాధలు: ఆదరాభిమానాలు – ప్రేమగౌరవాలు; చూరగొను –ఆకట్టుకొను; ఆదర్శం–ఇతరులు చూసినేర్చుకొన దగినది; సామ్రాజ్ఞి –మహారాణి; వర్తకుడు – వ్యాపారస్థుడు; నిలయం – స్థానం; అమితమైన – మితిలేని; ప్రజానురంజనం – ప్రజలశ్రేయస్సు; పరమావధి – చివరి ఆశయం; నిత్యస్మరణీయురాలు – ప్రతిదినం జ్ఞప్తిచేసుకొనదగిన వ్యక్తి.

2. ఈ కింది ప్రశ్నలకు సమాధానాలు చెప్పించండి – రాయించండి.

(i) ఊయల ఊపే చేయి సామర్థ్యమెటువంటిది ?

(ii) మన చరిత్రలో కోకొల్లలైన సందర్భాలేవి ?

(iii) మన సమాజంలో ఎటువంటి ప్రతిభ కల స్త్రీలు దర్శన మిస్తారు ?

(iv) ఎవరిలో రుద్రమ తలమానికం ?

(v) రుద్రమ ఎవరి కుమార్తె ?

(vi) ఆమె ఏ విద్యల్లో ఆరితేరింది ?

(vii) రుద్రమ రాజ్యానికి వచ్చింతర్వాత ఏంజరిగింది ?

(viii) రుద్రమ ప్రజాశ్రేయస్సుకోసం ఏంచేసింది ?

(ix) ఎటువంటి ప్రజాసేవాభిమాని రుద్రమ ?

(x) మార్కోపోలో రుద్రమ గురించి ఏమని రాసాడు ?

(xi) పరిపాలకులకు రుద్రమ ఏల ఆదర్శనీయురాలు ?

(xii) పాలకులు ఎట్టి లక్షణాలు కలిగివుండాలి ?

(xiii) రుద్రమ నిత్యస్మరణీయురాలగుటకు కారణాలేమి ?

3. ఈ కింది పదాలను సొం ,వాక్యాల్లో ఉపయోగించమనండి. ఆ వాక్యాలు రాయించండి.

ప్రదర్శించు – కత్తిపట్టు – దర్శనమిచ్చు – తలమానికం – నిశితంగా పరిశీలించు– ఆరితేరు–తిరుగుబాటుచేయు–సుస్థిరంచేయు –దృష్టిమరల్చు – నడుంకట్టు – పెంపొందించు–అభివృద్ధిపరచు – ఆదరాభిమానాలు – చూరగొను – అమితమైన.

4. ఈ కింది పదాలను ఉక్తలేఖనం చేయించండి – ఉచ్చరించమనండి.

ప్రతిభ – మధురం – కాకతీయ సామ్రాజ్యం – యుద్ధవిద్యలు – విశ్వాసపాత్రులు – సుస్థిరం – జాతీయభావం – సమైక్యత – దేశాభిమానం – క్షేమం – వైద్యశాలలు – ఆదర్శ సామ్రాజ్ఞి – మార్కోపోలో – ప్రజానురంజనం – పరమావధి – ప్రజారక్షణ – పరమధర్మం – పవిత్రపాలన – నిత్యస్మరణీయురాలు.

5. కిందటి పాఠంలో వచ్చిన 'ప్రాతఃస్మరణీయుడు ' అనే పదం ఈ పాఠంలోని ' నిత్యస్మరణీయురాలు ' అనే పదం ఈ రెండూ రాయించి పదాల్లోగల అర్థ సామ్యాన్ని చెప్పండి.

6. కింది వాక్యాల్లోని ఖాళీలను పాఠంలోని పదాలతో పూర్తిచేయించండి.

(i) మన చరిత్రలో __________ ఎందరో ఉన్నారు.

(ii) తండ్రి రుద్రమను __________ వలె పెంచాడు.

(iii) రుద్రమ కాకతీయ సామ్రాజ్యాన్ని __________ చేసింది.

(iv) కన్నతల్లి వలె __________ రక్షించే రుద్రమదేవి __________ ప్రజలు __________ ఎరుగరు.

(v) ప్రజల __________ చూరగొన్న __________ రుద్రమ.

7. చరిత్రలో రాజ్యాలేలిన స్త్రీలను గురించి, వారు ప్రజాక్షేమంకోసం చేసిన కార్యక్రమాలను గూర్చి చెప్పండి. వారి చిత్రాలు సేకరించి అల్బమ్‌లో అతికించమనండి. ఉదా : ఝాన్సీలక్ష్మిబాయి.

8. ' ఊయలను ఊపే చేయి ఉర్విని కూడా పాలించగలదు ' - ఇది ఒక సామెత. మరికొన్ని సామెతలను సేకరించి రాయమనండి.

9. మధురంగా పాడగలిగే స్త్రీల, కవిత్వం చెప్పగలిగిన స్త్రీల, వివరాలు సేకరించి చెప్పండి. పట్టికగా రాయించండి.

10. ' కన్నతల్లి వలె, కనురెప్పలవలె రక్షించడం ' - ఈ మాటల్లోని అర్థాన్ని వివరించండి. కనురెప్పలు, కన్నతల్లి ఎలా రక్షిస్తారో చెప్పండి.

11. ఈ కింది పదాలను కలిపి ఒక పదంగా రాసినపుడు వచ్చిన మార్పును గమనించమనండి.
ఆదరం - అభిమానం, ఆదరాభిమానాలు, కరువు - కాటకం, కరువుకాటకాలు ఇలాంటివే మరి కొన్ని పదాలు చెప్పండి. రాయించండి. మరికొన్ని పదాలను విద్యార్థులను సేకరించమనండి. రాయమనండి.

మానవ సేవయే మాధవసేవ

——— o ———

# 8. మఱ్రి విత్తనం

(ఎంత చిన్నవారైనా, వారిని చూచి నవ్వకూడదని తెలపడం ఈ పాఠం ఉద్దేశం.)

**ఈ పాఠంలోని కొత్త పదాలు :**

నొక్కిపట్టు, ఆరగించు, తాడి, ధూళి, నలుసు, కఱ్రి, నడ్డి, నరులు, తాళవృక్షం, తనివితీరు, వగలుపోవు, జాలిపడు, నవ్వుకొను, వటం, బీజం, మోసులెత్తు, నూగువేళ్ళు, ఉమ్ము, తాపడం, మగ్గిపోవు, దర్శనం, దుర్దినములు, ప్రాప్తమగు, సడలిపోవు, ఒరిగిపోవు, చెలరేగు, గర్వాంధుడు, దొడ్డవారు, అపహసించు, గడ్డికరచు, తుట్టతుద.

* * *

కాకి మఱ్రి పండు తెచ్చి
తాటి చెట్టు మీది కొచ్చి
కాళ్ళ మధ్య నొక్కిపట్టి
ఆరగింపు మొదలు పెట్టె.

అంత ఒక్క మఱ్రి గింజ
ఆ మట్టల మధ్య రాలె
అంత చిన్న విత్తు చూచి
అహోహోయని నవ్వె తాడి.

గాలిలోని ధూళికన్న
కంటిలోని నలుసుకన్న
కఱ్రి ఆవగింజకన్న
మఱ్రి గింజ చాల చిన్న.

నా కాయలు ముంతెడేసి
నా గింజలు పట్టెడేసి
నా విత్తులు కాయలు రాలిపడ్డ
నలిగిపోవు నక్కనడ్డి.

ఇనుపగుళ్ళవంటి గట్టి
నాకాయల భయంపుట్టి
నరులు నన్ను చేరరారు
నా నీడను నిదురపోరు.

ఇంత చిన్న గింజ నుంచి
ఎంత మొక్క ఎదిగివచ్చె ?
బెత్తెడేమొ, జానెడేమొ
మహా అయితె మూరెడేమొ.

తనపక్కని నిలిచియున్న
ఆకాశమునంటుచున్న
నన్ను చూచి అంత చిన్న
మొక్క ఎంత భయపడునో !

తాళ వృక్షమీ తీరున
చాలసేపు తనివి తీర
జాలిపడియె - నవ్వుకొనియె
రకరకాల వగలుపోయె.

బొంత కాకి ఎగిరిపోయె
కొన్నినాళ్ళు గడచిపోయె
మర్రి విత్తనమ్ము మాట
మరచిపోయె తాటిచెట్టు.

వానలు పడి తాటి మీది
వట బీజము మోసులెత్తె
చిట్టిపొట్టి నూగువేళ్ళు
పట్టుకొరకు పాకులాడె.

గిర్రున నేడాది తిరిగె
మర్రి మొక్క మూరెడాయె
దాని వేళ్ళు తాటిచెట్టు
కంఠానికి ఉచ్చులాయె.

తాటి మాను మీద మర్రి
తాపడమైనట్లు పెరిగె
వామనమూర్తి విధమ్మున
వటము తాటినాక్రమించె.



మర్రి చెట్టు కౌగిటిలో
మగ్గిపోవు తాళమునకు
సూర్యదర్శనమ్ము లేక
దుర్దినములు ప్రాప్తమయ్యె.

మరో కొన్ని వర్షాలకు
సడలిపోయె దాని పట్టు
వృక్షరాజు ఒడిలోనికి
ఒరిగిపోయె తాటిచెట్టు.

బలముందని - ధనముందని
చెలరేగెడి గర్వాంధుడు
దొడ్డవారి నపహసించి
గడ్డి కరచు తుట్టతుదకు.

( డా. మహీధర నళినీ మోహన్ గారి రచన )
("కోతి తపస్సు" గేయ కథలు
- బాలల అకాడమీ వారి ప్రచురణ)

## అభ్యాసవేదిక

1. ఈ కింది పదాలకు అర్థాలు చెప్పండి. రాయించండి.
ఆరగింపు-నైవేద్యం,తిను,భుజించు;తాడి-తాటి;ధూళి-దుమ్ము; క్రి - నలుపు; నడ్డి-నడుము; నరులు - మనుషులు; తాళ వృక్షం - తాటిచెట్టు;తనివి - తృప్తి; వగలు-విలాసం,షోకులు; వటబీజం - మర్రివిత్తనం; మోసులెత్తు - మొలకెత్తు; కంఠం-గొంతుక, కుత్తుక; దర్శనం-చూపు; ఉచ్చు - ఉరి;దుర్దినం - చెడుదినం; ప్రాప్తమగు- దొరుకు;వర్షాలు-సంవత్సరాలు, వానలు; గర్వాంధుడు - గర్వము చేత కండ్లు కనబడనివాడు; అపహసించు - గేలిచేయు; తుట్టతుద - చిట్టచివర.

2. ఈ కింది పదాలను సొంత వాక్యాల్లో చెప్పించండి - రాయించండి.

అహహోయని నవ్వు - నలిగిపోవు - భయంపుట్టు - ఎదిగివచ్చు - నిలిచియుండు - తనివితీరు - జాలిపడు - నవ్వుకొను - వగలుపోవు - మోసులెత్తు - పాకులాడు - తాపడమగు - ఆక్రమించు - మగ్గిపోవు - ప్రాప్తమగు - సడలిపోవు - ఒరిగిపోవు - చెలరేగు - అపహసించు - గడ్డి కరచు.

3. ఈ కింది వాక్యాల్లోని ఖాళీలను పాఠంలోని పదాలతో పూర్తిచేయించండి.

(i) కాకి మర్రి పండును నొక్కి పట్టింది.

(ii) మర్రిగింజ ఆ మధ్య రాలె.

(iii) బెత్తెడేమో జానెడేమో మూరెడేమొ.

(iv) తాడికాయల భయానికి నన్ను చేరరారు.

(v) చిట్టిపొట్టి కొరకు పాకులాడె.

4. ఈ కింది ప్రశ్నలకు సమాధానాలు చెప్పించండి. రాయించండి.

(i) ఎవరికి సూర్యదర్శన ప్రాప్తం కాలేదు ?

(ii) సూర్యదర్శనం కాకపోతే ఏమవుతుంది ?

(iii) గర్వాంధుడు తుట్టతుదకు ఏమవుతాడు ?

(iv) దొడ్డవారిని అపహసిస్తే ఏమవుతుంది ?

(v) దొడ్డవారంటే ఎవరు ?

(vi) మర్రి తాటిచెట్టును ఎలా ఆక్రమించింది ?

ఈ కింది పదాలను వివరించండి. రాయించండి.

ఆరగింపు - కంటిలోని నలుసు - వామనమూర్తి - సూర్యదర్శనం - వృక్షరాజా.

6. ఈ పాఠంలోని నామవాచకాలు - విశేషణాలను పట్టికగా రాయించండి.

7. ఈ కింది పదాలను స్పష్టంగా ఉచ్చరించమనండి - రాయమనండి.

గర్వాంధుడు - ప్రాప్తము - అహహోయని నవ్వుట - తాళవృక్షము - అపహసించుట.

8. గర్వపడటం వల్ల కలిగే కష్టనష్టాలను చెప్పండి. ఎప్పుడూ గర్వపడరాదని చెప్పండి. ఇలాంటిదే మరో సన్నివేశాన్ని చెప్పండి.

**చేసిన తప్పు ఒప్పుకొని పశ్చాత్తాప పడాలి**

——— o ———

# 9. పోస్టాఫీసు

(సమాజోపయుక్తసంస్థలగురించి బాలబాలికలకు తెలిపి వాటిని సద్వినియోగం చేసికోవాలని చెప్పడం ఈ పాఠం ఉద్దేశం.)

**ఈ పాఠంలోని కొత్త పదాలు :**

చిరునామా, దాదాపు, సదుపాయం, పొదుపు పథకం, వేగిరం, సౌకర్యం, సంచయిక.

* * *

తండ్రి : గోపీ ! ఈ కార్డు పోస్టుచేసిరా.

గోపి : అంటే ఏం చెయ్యాలి నాన్నగారూ ?

తండ్రి : మీ బడికి వెళ్ళేదారిలో పోస్టాఫీసు ఉంది. తెలుసుకదా ! పోస్టాఫీసు బయట పోస్టు బాక్సు ఉంటుంది. ఈ కార్డు అందులో పడవెయ్యాలి.

గోపి : అందులో వేస్తే ఏమవుతుంది ?

తండ్రి : ఇదుగో ! ఇటుచూడు. కార్డుమీద ఇక్కడ చిరునామా రాశాను. ఇది మామయ్యగారి చిరునామా. మామయ్య పేరు, ఊరు, జిల్లా, పిన్ కోడ్ నెంబరూ అన్నీ దీనిమీద రాసి ఉన్నాయి. పోస్టుడబ్బాలో వేసిన ఈ కార్డును పోస్టాఫీసువాళ్ళు మామయ్య ఊరికి పంపిస్తారు. అక్కడి పోస్టాఫీసువాళ్ళు మామయ్యకు ఈ కార్డు అందిస్తారు.

గోపి : పోస్టాఫీసువాళ్ళు చేసే పని అదా ! నాకింతవరకూ తెలియదు.

తండ్రి : పోస్టాఫీసులు అందుకే ఉన్నాయి. వార్తలు పంపాలంటే వెనకటి రోజుల్లో మనుషులే వెళ్ళి చెప్పేవారు. ఇప్పుడొక కార్డుమీదనో, ఇన్ లాండ్ కవరులోనో లేక కవర్లోనో విషయం రాసి తపాలాపెట్టెలో పడేస్తే చాలు, అది ఎవరికి చేరాలో వాళ్ళకు చేరుతుంది.

గోపి : ఇలాంటి పోస్టాఫీసులు అన్ని ఊళ్ళల్లోనూ ఉన్నాయా ?

తండ్రి : ఇప్పుడు దాదాపు అన్ని ఊళ్ళల్లోనూ ఉన్నాయి. మరీ చిన్న ఊరైతే ఆ పక్కనే ఉండే పెద్ద ఊర్లో ఉంటుంది.




గోపి : మనం రాసిన ఉత్తరాలన్నీ ఆ ఊళ్లకు ఎలా వెళ్తాయి?

తండ్రి : బస్సుల్లో, రైళ్ళలో, విమానాల్లో వెళ్తాయి. ఈ సదుపాయం లేనిచోట్ల కాలినడకన కూడా పంపిస్తారు. మనం రాసిన అడ్రసులను బట్టి ఏ ఊళ్ళకు ఏవి వెళ్ళాలో వేరే వేరే సంచుల్లో పోస్టాఫీసువాళ్ళే పంపిస్తారు.

గోపి : అప్పుడప్పుడూ పోస్ట్‌మేన్ వచ్చి డబ్బులిస్తూ ఉంటాడే ! ఎందుకిస్తాడు ?

తండ్రి : పోస్టాఫీసుద్వారా ఇతర ఊర్లకు డబ్బు పంపించే సదుపాయం ఉంది. దీన్ని మని ఆర్డరు అంటారు. పట్నంలో చదువబోయే మీ అన్నయ్యకు ప్రతి నెలా మనం అలానే డబ్బు పంపించాలి.

గోపి : మని ఆర్డరు అంటే ఏమిటో వివరంగా చెప్పండి నాన్నగారూ !

తండ్రి : పోస్టాఫీసులో మనిఆర్డర్ కొరకు ఒకఫారం దొరుకుతుంది.దాన్నిపూర్తి చేసిడబ్బుకట్టేస్తే అన్నయ్యకుమరోపోస్ట్‌మేన్ అక్కడ అందిస్తాడు.

గోపి : పోస్టాఫీసువల్ల ఇంకే ఉపయోగాలున్నాయి ?

తండ్రి : వాటిల్లో మనం డబ్బు దాచుకోవచ్చు. మీ బడి పిల్లలకోసం ప్రత్యేకంగా పొదుపు పథకం 'సంచయిక' ఉంది. మీరు దాచుకొన్న డబ్బుపై వడ్డీ కూడా ఇస్తారు. మీ మేస్టారినడిగి నీవుకూడా సంచయికలో చేరు. నేను నీకపుడపుడూ ఇచ్చే చిల్లర డబ్బులు

దుబారాచేయకుండా సంచయికలో దాచుకొంటే నీకు తర్వాత్తర్వాత పనికొస్తాయి. కొన్ని పెద్దగ్రామాల్లోని పోస్టాఫీసుల్లో టెలిగ్రాం సౌకర్యం కూడా ఉంటుంది.

గోపి : టెలిగ్రాం అంటే ఏమిటి నాన్నగారూ !

తండ్రి : టెలిగ్రాం అంటే వేగిరంగా తంతి తీగలద్వారా వెళ్ళేవార్త. ఒక చోటినుండి మరోచోటికి తక్కువ సమయంలో వార్త చేరుతుంది.

గోపి : ఇన్ని పనులు చేయడానికి పెద్ద పట్టణాల్లో ఒక్క పోస్టాఫీసు సరిపోతుందా ?

తండ్రి : పెద్దపట్టణాల్లో చిన్న తపాలా కార్యాలయాలు (బ్రాంచి పోస్టాఫీసులు) చాలాఉంటాయి.అందువల్లసౌకర్యంగాఉంటుంది.తంతికార్యాలయాలు కూడా వేరుగా ఉంటాయి. వీటికి ముఖ్య కార్యాలయాలు కూడా ఉంటాయి. ఇవన్నీ ప్రజలకు వార్తా సౌకర్యాలు కల్గిస్తున్నాయి.

గోపి : సరే ! తెల్సింది నాన్నగారూ ! దార్లో ఉత్తరం పోస్టుచేసి బడికి వెళ్తాను. నా మిత్రులకుకూడా ఈ విషయాలన్నీ చెప్తాను. ఈరోజే మా మాష్టార్ని అడిగి 'సంచయిక' లో డబ్బు దాస్తాను.

### అభ్యాసవేదిక

1. ఈ కింది పదాలకు అర్థాలు చెప్పండి. రాయించండి.
   సదుపాయం – సౌకర్యం, వేగిరం – తొందర.
2. ఈ కింది వాక్యాల్లోని ఖాళీలను పాఠంలోని పదాలతో పూర్తిచేయించండి.
   (i) ఇది మామయ్యగారి
   (ii) బస్సు సదుపాయంలేనిచోట్ల కూడా పంపిస్తారు.
   (iii) చిరునామాలో —— విధిగా రాయాలి.
   (iv) సంచయికలో డబ్బుపై వడ్డీకూ
   (v) దార్లో ఉత్తరం బడికి వెళ్తాను.
   (vi) తంతితపాలా కార్యాలయాలు ప్రజలకు ——కల్గిస్తున్నాయి.
3. (i) మీ గ్రామంలోని/దగ్గరి గ్రామంలోని పోస్టాఫీసుకు విద్యార్థుల్ని తీసికొని

వెళ్ళి అక్కడి కార్యకలాపాలను పరిశీలించమనండి. వాళ్ల
తపాలా అధికారిని ప్రశ్నించమనండి. వివరాలు రాయమనండి.

(ii) కార్డు - ఇన్‌లాండ్ కవరు - కవరు - స్టాంపులు - మని ఆర్డరు మొదలగునవి విద్యార్థులకు చూపండి. (వాడినవి - వాడనివి)

(iii) మీ గ్రామంలోని ఇతర ప్రజోపయోగ సంస్థలైన గ్రామ పంచా పాఠశాల - సహకార సంఘం - మహిళాసంఘం - మొదలగు: కనీసం ఒక సంస్థ గురించి సంభాషణ రూపంలో చెప్పించండి.రాయిం

(iv) ఈ పాఠాన్ని విద్యార్థులచే సంభాషణగా చెప్పించండి.

4. ఈ కింది ప్రశ్నలకు సమాధానాలు చెప్పించండి. రాయించండి.

(i) పోస్టాఫీసువాళ్ళు చేసే పని ఏమిటి ?

(ii) మనం పోస్టుడబ్బాలో వేసిన ఉత్తరాలను వాళ్ళు ఎలా ఇతరులకు చేరవేస్తారు ?

(iii) పాఠశాలలోని పొదుపు పథకం పేరేమిటి ?

(iv) పెద్దపట్టణాల్లోని పోస్టాఫీసులు ఏ సౌకర్యాలు కల్గిస్తాయి ?

(v) టెలిగ్రాం అంటే ఏమిటి ?

(vi) చిల్లర డబ్బులు ఏంచేస్తే బాగుంటుంది ?

(vii) పోస్టాఫీసువాళ్ళు చేసే పనులు ఏమిటి ?

5. ఈ కింది పదం చూడండి.

<u>దాదాపు</u> : ఈ మూడక్షరాల పదంలోని మొదటి అక్షరం తొలిగిం మిగిలిన పదం <u>దాపు.</u> ఈ పదం కూడా ఒక అర్థాన్ని ఇస్తుంది.
అట్లే విద్యార్థులకు మరికొన్ని పదాలు చెప్పండి. రాయించండి. సేకరించమన

| | | |
|---|---|---|
| ఉదా : | కపోతరాజు | దాశరథి |
| | పోతరాజు | శరథి |
| | తరాజు | రథి |
| | రాజు | |

ఇట్లు పదక్రీడలు చేయించండి.

6. బాలలూ ! ఈ కింది వాక్యాలను గమనించండి.

గోపీ ! ఈ కార్డు, పోస్టు చేసిరా.

ఈ కార్డు అందులో పడెయ్యాలి.

మామయ్య ఊరికి పంపిస్తారు.

పై వాక్యాల చివరి పదాల కింద గీత గీయబడింది. ఎందుకో తెలుసా ! ఆ పదాలు ఒక పనిని తెల్పుతున్నాయి. ఈ పనిని తెల్పే పదాన్ని వ్యాకరణంలో క్రియాపదం లేక క్రియ అంటారు.

ప్రస్తుత పాఠంలోని క్రియాపదాలను పట్టికగా రాయండి.

7. ఈ పాఠంలోని నామవాచకాలను, విశేషణాలను పట్టికగా రాయించండి.

8. ఈ పాఠంలోని ప్రశ్నచిహ్నాలు–ఆశ్చర్యచిహ్నాలున్న వాక్యాలను ఎత్తి రాయించండి.

9. ఈ పాఠంలో ఇతర భాషా పదాలున్నాయి. ఉదా : పోస్టు, బాక్స్ మొదలగునవి. ఇలాంటి పదాలను పట్టికగా రాయమనండి. ప్రతిరోజూ విద్యార్థులు వింటున్న ఇతర పదాలను కూడా రాయించండి.

**తలిదండ్రులను – గురువులను గౌరవింపుము**

——— o ———

# 10. అన్నదమ్ములు

(తమకున్నదానిలో ఇతరులకు కొంత పంచిఇచ్చే గుణాన్ని పెంపొందించడమే ఈ పాఠం ఉద్దేశం.)

**ఈ పాఠంలోని కొత్త పదాలు :**

ఏనుగుఎక్కినంత, ముస్తాబగు, ధగధగ, మెరిసిపోవు, కొల్లాయి, భీతిల్లు, వస్త్రం

* * *

ఒకసారి గాంధీజీ ఒక బడికి వెళ్ళారు. ఆయన్ని చూడగానే పిల్లలకు ఏనుగు ఎక్కినంత ఆనందం కల్గింది. ఆయన పేరు చాలాసార్లు విన్నారే కాని ఆయన్ని వాళ్ళు ఎప్పుడూ చూడలేదు. గాంధీజీ తమ బడికి వస్తున్నారని సంతోషంతో ఆ రోజు పిల్లలంతా ఉన్నంతలో చక్కగా ముస్తాబయి వచ్చారు.

ఒక పిల్లవాడు కొత్తచొక్కా, కొత్త లాగు వేసుకొని వచ్చాడు. టోపీకూడా పెట్టుకొన్నాడు. అతడి తలిదండ్రులు ధనవంతులు కనుక అతడు వేసికొన్న దుస్తులు ఖరీదైనవి. ఆ దుస్తుల్లో అతడు ధగధగా మెరిసిపోతున్నాడు.

ఆ అబ్బాయికి కూడా గాంధీజీ అంటే ఎంతో గౌరవం. కాని ఆయన వేషం అతడికి నచ్చలేదు. మోకాళ్ళు దిగని ఆ కొల్లాయి ఏమిటి ? పైన మరో చిన్న గుడ్డ ? ఇవేనా గాంధీజీ దుస్తులు! అని ఆ అబ్బాయి ఆశ్చర్యపోయాడు.



తనలా ఆయన ఎందుకు ఖరీదైన చొక్కా వేసుకోలేదు ? అని ప్రశ్నించుకొన్నాడు తనలో.

ఉండబట్టలేక ఆ అబ్బాయి గాంధీజీని అడిగాడు. 'మీరెందుకు చొక్కా వేసికోరు ?' అని. అంతటితో ఊరుకోలేదు. 'మీరు కనుక ఊం అంటే మా అమ్మని అడిగి మీకో మంచి చొక్కా తెచ్చిపెడతాను ' అన్నాడు.

ఈ మాటలు విని అందరూ భయపడ్డారు. గాంధీజీకి ఏమన్నా కోపం వస్తుందేమోనని ఉపాధ్యాయులూ భయపడ్డారు. గాంధీజీ చిరునవ్వు నవ్వారు. 'తప్పకుండా నేను మంచి చొక్కా తొడుక్కుంటాను. అయితే నే నొక్కణ్ణేకాదు. నాకు కోట్ల సంఖ్యలో అన్నదమ్ములున్నారు. మరి మీ అమ్మగారు మా కందరికీ తలా ఒక చొక్కా ఇవ్వగలుగుతారా ?' అని అన్నారు.

గాంధీజీకి ఇంతమంది అన్నదమ్ములా అనుకొని ఆ అబ్బాయి ఆశ్చర్యపోయాడు. బాలలూ ! మీరూ ఆశ్చర్యపోతారా ? కొందరికైనా వస్త్రాలు సమకూరుస్తారా ? ఆలోచించండి.

(శ్రీ చల్లా రాధాకృష్ణశర్మ గారి రచన)

('అంతా ఒక్కటే'-బాలల అకాడమీవారి ప్రచురణ)

ఆభ్యాసవేదిక

1. ఈ కింది పదాలకు అర్థాలు చెప్పండి. రాయించండి.
   ముస్తాబు - అలంకరణ, ఖరీదైనవి - వెలగలవి, భీతి - భయం
   సమకూర్చు - తెచ్చిపెట్టు, సిద్ధంచేయు.
2. ఈ కింది మాటల్ని విద్యార్థుల సొంత వాక్యాల్లో రాయించండి.
   ఏనుగు ఎక్కినంత - ముస్తాబగు - ధగధగా - మెరిసిపోవు - ఆశ్చర్యపడు - తెచ్చిపెట్టు - సమకూర్చు.
3. ఈ కింది వాక్యం విద్యార్థుల్ని గమనించమనండి.
   గాంధీజీ దుస్తుల్ని చూచి ఆ అబ్బాయి ఆశ్చర్యపోయాడు.
   కింద గీతగీచిన వాక్య భాగాన్ని మార్చకుండా మరో ఐదు వాక్యాలు విద్యార్థులచే చెప్పించండి. రాయించండి.
4. ఈ కింది ప్రశ్నలకు సమాధానాలు చెప్పించండి. రాయించండి.
   (i) పిల్లలకు ఆనందం ఏల కల్గింది ?
   (ii) పిల్లలు ఎందుకు ముస్తాబయ్యారు ?
   (iii) పిల్లలు ఏయే సందర్భాల్లో ముస్తాబవుతారు ?
   (iv) నీవు / మీరు ఏయే సందర్భాల్లో ముస్తాబవుతారు ?

(v) గాంధీజీ వేషం అబ్బాయికి ఎందుకు నచ్చలేదు ?

(vi) అబ్బాయి గాంధీజీకి ఏం తెచ్చిపెడ్తానన్నాడు ?

(vii) గాంధీజీకి ఎంతమంది అన్నదమ్ములున్నారు ? వారెవరు ?

(viii) అందరికీ వస్త్రాలు సమకూర్చాలంటే ఏంచేయాలి ?

5. ఈ కింది వాక్యాల్లోని ఖాళీలను పాఠంలోని పదాలతో పూర్తిచేయించండి.

(i) బాలలూ మీరూ______________ .

(ii) గాంధీజీ పేరు ______________ విన్నారే కాని ఆయన్ని వాళ్ళు ____________ చూడలేదు.

(iii) అబ్బాయికి కూడా గాంధీజీ __________ ఎంతో______________.

(iv) మోకాళ్ళు దిగని ఆ ______________ ఏమిటి ?

6. విద్యార్థులను గాంధీజీ చిత్రాలను సేకరించమనండి. అల్బమ్‌లో అతికించమనండి.

7. తమ చుట్టూ ఉన్న వ్యక్తులు ధరించే వివిధ వస్త్రాల విశేషాలను పట్టికగా రాయించండి.

ఉదా : చొక్కా, లాగు, ప్యాంటు మొదలగునవి.

8. 'మోకాలు' ఇది శరీరంలో ఒక భాగం, మిగతా శరీర భాగాల పేర్లు రాయించండి.

9. చిరునవ్వు : ఈ పదంలో 'నవ్వు' అనే పదానికి మొదట 'చిరు' అనే పదం ఉంది. 'మర్రి విత్తనం' పాఠంలో కూడా నవ్వుల గురించి వచ్చింది. వీనిని గుర్తింపజేయండి. ఇలాంటి పదాలను పట్టికగా రాయించండి.

10. ఈ పాఠంలోని నామవాచక పదాలు, విశేషణాలను, క్రియాపదాలను పట్టికగా రాయించండి.

11. ఈ పాఠంలోని ప్రశ్నచిహ్నం, ఆశ్చర్యచిహ్నం చివరగల వాక్యాలను ఎత్తి రాయించండి.

---

ఓర్పుంటే చెడిపోయేకార్యం కూడా ఫలిస్తుంది .

---

— o —

# 11. నాగోబా జాతర

(మన సంస్కృతిని విద్యార్థులకు తెలియ చెప్పుట ఈ పాఠం ఉద్దేశం.)

**ఈ పాఠంలోని కొత్త పదాలు :**

ఉత్సవం, దట్టము, ఘనంగా, నిర్వహించు, ప్రసిద్ధి, కులదైవం, ఆరాధ్యదైవం, కొలుచు, ఇరుగుపొరుగు, తండోపతండాలు, తరలివచ్చు, చోటుచేసికొను, నృత్యాలు, వధువు, సమర్పించు, మొక్కుబడి, సమస్యలు, పరిష్కారం, మార్గాలు, గిరిజనులు, ఆకర్షణ, తరతరాలు, అద్దంపట్టు, కన్నులపండుగ, చిత్రచిత్రాలు, లయబద్ధం, అలవికాదు, సదుపాయాలు, కదలివచ్చు, సరదా, సంత, పరిమితం.

* * *

మనదేశంలో పండుగలు, జాతరలు, ఉత్సవాలు ప్రతిదినం ఏదో ఒక చోట జరుగుతూనే ఉంటాయి. అట్టి జాతరల్లో ఒకటి ఆదిలాబాద్ జిల్లా కేస్లాపూర్ గ్రామంలో జరిగే నాగోబా జాతర. దట్టమైన అడవులతో, చుట్టూరా గుట్టలతో, వాగులతో కూడిన ఈ గ్రామంలో ప్రతిఏటా ఘనంగా నిర్వహించే జాతరే నాగోబా జాతర. ఈ జాతర గోండుజాతి గిరిజనుల జాతరగా ప్రసిద్ధిచెందింది. తమని కాపాడ్డానికివచ్చిన నాగోబాను దేవుడిగా భావించిన గోండు జాతివారు ఆయన్ను ఘనంగా పూజిస్తారు. ఈ జాతరలో నాగోబాను తమ కులదైవంగా, ఆరాధ్యదైవంగా కొలుస్తారు.



మూణ్ణాళ్ళపాటు జరిగే ఈ ఉత్సవానికి ఇరుగుపొరుగు గ్రామాలనుండే కాక ఇతర రాష్ట్రాలనుండి కూడా జనం తండోపతండాలుగా తరలివస్తారు. ఈ జాతరలో నాగోబాకు పూజలతోపాటు దర్బారు, సాంస్కృతిక కార్యక్రమాలు, సంత మొదలైనవి కూడా చోటుచేసికొంటాయి.



ముందుగా నాగోబా విగ్రహాన్ని గోదావరీ జలాలతో అభిషేకించి గోండుజాతివారుతమసంప్రదాయాన్ని అనుసరించి తప్పెట్లు, తాళాలు, నృత్యాలు, పాటలతో పూజలు చేస్తారు. కొత్తగా పెండ్లయిన వధువులు నాగోబా దేవుడికి పాలు, పంచదార, కొబ్బరికాయ, కాటుక డబ్బా, అద్దం మొదలైనవి సమర్పించి మొక్కుబడి తీర్చుకొంటారు.

జాతరలో ఒక రోజు దర్బారు జరుగుతుంది. దర్బారులో గోండుజాతివారి సమస్యలకు పరిష్కారాలు కనుగొంటారు. అధికారులు, అధికారేతరులు, ప్రజలూ పెద్ద సంఖ్యలో ఈ దర్బారులో పాల్గొని గిరిజనుల అభివృద్ధికి మార్గాలను గూర్చి ఆలోచిస్తారు.



జాతరలో మరో ఆకర్షణ 'గుసాడి నృత్యం'. గోండు ప్రజల తరతరాల సంస్కృతికి ఈ నృత్యం అద్దం పడుతుంది. ఈ సంప్రదాయ నృత్యం చూడముచ్చటగా కన్నులపండుగగా ఉంటుంది. నెమలి పించాలతో తయారుచేసిన ఆభరణాలు ధరించి చిత్ర చిత్రములైన వేషాలతో లయబద్ధంగా అడుగులువేస్తూ చేసే ఈ నృత్యం.....మాటల్లో చెప్పనలవి కాదు. చూసి తీరాల్సిందే.

మూడురోజులు జరిగే ఈ జాతరలో పాల్గొనడానికి వచ్చే గోండులు ఎడ్లబండ్లు కట్టుకొని రావడం మాత్రమే గాక, కాలినడకన కూడా అన్ని సదుపాయాలతో కదిలివస్తారు. అసలు ఈ జాతరకు రాని గిరిజను డుండడేమో అనిపిస్తుంది. ఇక్కడ జాతరలో సరదాగా మూడు రోజులు



గడిపి సంతలో తమకు కావాల్సిన వస్తువులను కొనుగోలు చేసికొంటారు. మూడోరోజు సాయంత్రం నుండి కేస్లాపూర్ వదిలివెళ్తారు. ఈ మూణ్ణాళ్ళూ వీరి కోసం అన్ని సదుపాయాలూ ప్రభుత్వం కల్పిస్తుంది. ఆనందంతో జరుపుకొనే ఈ జాతరలో వారికి మూడురోజులూ మూడు నిమిషాలుగా తోస్తాయి.

నలుగురు మనుషులను నాలుగురోజులపాటు కలిపి ఉంచే ఈ జాతరలు, ఉత్సవాలు కేవలం ఆయా కులం, మతం వారికే పరిమితం కాకుండా మానవులందరికీ ఆనందాన్నీ, ఉత్సాహాన్నీ ఇవ్వాలని కోరుకొందాం !

బాలలూ ! మనంకూడా మనకు దగ్గర్లోని జాతరకు వెళ్దామా !

*(ఆధారం - ఆంధ్రప్రదేశ్ మాసపత్రిక 91, డిసెంబర్)*

### అభ్యాసవేదిక

1. ఈ కింది పదాలకు అర్థాలు చెప్పండి. రాయించండి.

దట్టమైన –ఒత్తైన,చొరరాని;ఘనంగా–గొప్పగా, నిర్వహించు–చేయు, ప్రసిద్ధిచెందు – పేరుకెక్కు, భావించు – అభిప్రాయపడు, ఆరాధ్యదైవం – పూజచేయదగిన దే డు, మూణ్ణాళ్ళు – మూడురోజులు, తండోపతండాలు – గుంపులుగుంపులు, అ ిషేకించు – స్నానము చేయించు, తడుపు; వధువు – కొత్తగా పెండ్లైన స్త్రీ, ప ష్కారం – తీర్పు, ఆభరణాలు – నగలు, లయబద్ధం – లయకులోబడి, అలవి – శక్యము, వీలు; సదుపాయం – సౌకర్యం, కొనుగోలు – కొనుక్కోవటం, పరిమితం – త్యేకం కొందరి కోసం; సరదా – సంతోషం.

2. ఈ కింది మాట ి విద్యార్థుల సొంతవాక్యాల్లో చెప్పించండి. రాయించండి.

ప్రసిద్ధిచెందు- ర్వహించు-కులదైవం-ఆరాధ్యదైవం-ఇరుగుపొరుగు- తండోపతండాలు-తరలిరావడం-చోటుచేసికొను-అభిషేకించు-మొక్కుబడి - అద్దంపట్టు- చూడముచ్చట-కన్నులపండుగ - చిత్రచిత్రములు - చూసితీరాలి - కదలివచ్చు - వదలివెళ్ళు.

3. ఈ కింది ప్రశ్నలకు సమాధానాలు చెప్పించండి. రాయించండి.

(i) నాగోబా జాతర జరిగే గ్రామం ఎలాటి స్థలంలో ఉంది ?

(ii) నాగోబా జాతర ఎవరి జాతరగా ప్రసిద్ధి చెందింది ?

(iii) జాతరలో ప్రధాన ఆకర్షణ ఏది ?

(iv) నాగోబా జాతరలో ఏ యే అంశాలు చోటుచేసికొంటాయి ?

(v) కొత్తగా పెండ్లయిన వధువులు నాగోబాకు ఏమి సమర్పిస్తారు ?

(vi) దర్బారులో ఎవరెవరు పాల్గొంటారు ? ఏంచేస్తారు ?

(vii) 'గుసాడి నృత్యం' ఎలా ఉంటుంది ?

(viii) ఈ జాతరకు ప్రభుత్వం కల్పించే సౌకర్యాలేవి ?

(ix) జాతరల ప్రధాన ఉద్దేశ్యం ఏమిటి ?

4. మీ గ్రామం / పట్టణానికి దగ్గర్లోని జాతరను / తిరునాళ్ళను / ఉత్సవాల్ని విద్యార్థులను సందర్శించమనండి. తాము సందర్శించిన జాతర/తిరునాళ్ళ/ ఉత్సవాన్ని గూర్చి పది వాక్యాలు రాయమనండి. ప్రధాన ఆకర్షణలేవో చెప్పించండి.

5. ఈ కింది పదాలలోని లేఖనదోషాలను గుర్తించమనండి. సరిచేసి రాయమనండి.

ఆరాద్యదైవం - అబిశేకించుట - అభివ్రుద్ది - ప్రబుత్వం - ఉత్సాహం.

6. ఈ కింది పదాలు ఉక్తలేఖనం చేయించండి.

నెమిలిపింఛం, లయబద్ధం, ఆభరణం, కేస్లాపూర్, ప్రసిద్ధి, విగ్రహం.

7. ఈ కింది పదంలోని ఒక్కొక్క అక్షరాన్ని వదిలివేసి చదివితే మరో పదం ఏర్పడుతుంది. ఇట్టి మరోకొన్ని పదాలు సేకరించమనండి.

ఉదా : ఆభరణం.

భరణం.

రణం.

8. ఈ పాఠంలోని సర్వనామ పదాలు - క్రియా పదాలు పట్టికగా రాయమనండి.

9. ఈ పాఠంలోని ఆశ్చర్యచిహ్నం ఉన్న వాక్యాలను ఎత్తి రాయించండి.

**ఉమ్మడి పనిలో ఉత్పాదక శక్తి పెరుగుతుంది**

0

# 12. నక్షత్రాలు – రాసులు

(ప్రాచీనశాస్త్ర విజ్ఞానాన్ని ఎలా నిజజీవితంలో వినియోగిస్తున్నామో చెప్పడం ఈ పాఠం ఉద్దేశం.)

**ఈ పాఠంలోని కొత్త పదాలు :**

మినుకుమినుకుమను, విభజించు, విభాగం, సూర్యోదయం, ఉదయించు.

* * *

ఆకాశంలో ప్రతి రాత్రీ మన కెన్నో నక్షత్రాలు కనిపిస్తాయి. చంద్రుడులేని రాత్రుల్లో కొంత వెలుతురును కూడా ఇస్తాయి. నక్షత్రాలు మనం పగలు చూచే సూర్యుడికన్నా పెద్దవి. కాని అవి మనకు సూర్యుడికంటె కూడా దూరంలో ఉండటంవల్ల మినుకుమినుకుమంటూ చిన్నవిగా కనిపిస్తాయి.

ఆ నక్షత్రాల్లో ఇరవై ఏడు నక్షత్రాలు ముఖ్యమైన వంటారు. అవి :

| | | | |
|---|---|---|---|
| 1. అశ్విని | 2. భరణి | 3. కృత్తిక | 4. రోహిణి |
| 5. మృగశిర | 6. ఆర్ద్ర | 7. పునర్వసు | 8. పుష్యమి |
| 9. ఆశ్లేష | 10. మఖ | 11. పుబ్బ | 12. ఉత్తర |
| 13. హస్త | 14. చిత్త | 15. స్వాతి | 16. విశాఖ |
| 17. అనూరాధ | 18. జ్యేష్ఠ | 19. మూల | 20. పూర్వాషాఢ |
| 21. ఉత్తరాషాఢ | 22. శ్రవణం | 23. ధనిష్ఠ | 24. శతభిషం |
| 25. పూర్వాభాద్ర | 26. ఉత్తరాభాద్ర | 27. రేవతి. | |




ప్రతి నక్షత్రకాలాన్నీ నాలుగు భాగాలుగా విభజిస్తారు. ప్రతి భాగాన్ని ఒక పాదం అంటారు. ఇలాంటి తొమ్మిది పాదాలు కలిస్తే ఒక రాశి అవుతుంది. సాధారణంగా ప్రతినెలా ఇరవై ఒకటో తేదీనుండి తర్వాతి నెల ఇరవయ్యవ తేదీ వరకు సూర్యోదయం ఒక్కొక్క రాశిలో జరుగుతూ ఉంటుంది. ఉదాహరణకు మార్చి ఇరవై ఒకటో తేదీ నుండి ఏప్రిల్ ఇరవై వ తేదీ వరకు సూర్యుడు మేషరాశిలో ఉదయిస్తాడు.

ఇలా సంవత్సరంలో మొత్తం 12 రాసుల్లో సూర్యుడు ఉదయిస్తూ ఉంటాడు. ఆ రాసులు ఇవి.

| | | | |
|---|---|---|---|
| 1. మేషం | 2. వృషభం | 3. మిధునం | 4. కర్కాటకం |
| 5. సింహం | 6. కన్య | 7. తుల | 8. వృశ్చికం |
| 9. ధనుస్సు | 10. మకరం | 11. కుంభం | 12. మీనం |

ఈ పన్నెండు రాసుల కాలాన్ని ఒక సంవత్సరం అంటారు.

## అభ్యాసవేదిక

1. ఈ కింది ప్రశ్నలకు సమాధానాలు చెప్పించండి. రాయించండి.
   - (i) ఆకాశంలో మనకు కన్పించే నక్షత్రాలెన్ని ?
   - (ii) నక్షత్రాలు మనకు చిన్నవిగా ఎందుకు కన్పిస్తాయి ?
   - (iii) ప్రతి నక్షత్రాన్నీ ఎన్ని పాదాలు/భాగాలుగా విభజించారు ?
   - (iv) ఒకరాశి ఎలా ఏర్పడుతుంది ?
   - (v) మేషరాశిలో సూర్యుడు ఏ కాలంలో ఉదయిస్తాడు ?
   - (vi) సంవత్సరం అంటే ఏమిటి ?
2. నక్షత్రాల పేర్లన్నీ కంఠస్థం చేయించండి. పట్టికగా రాయించండి.
3. రాసుల పేర్లు కంఠస్థం చేయించండి. రాయించండి.
4. గ్రామీణ ప్రాంతాల్లో రాత్రులందు నక్షత్రాలు చూచి సమయం చెప్తారు. ఈ విషయాల్ని సేకరించి విద్యార్థులకు చెప్పండి.
5. పట్టణ ప్రాంతంలోనివారిని తమకు దగ్గర్లో ఉన్న నక్షత్రశాలను సందర్శించమని చెప్పండి. విశేషాలు రాయమనండి.
6. నక్షత్రాల పేర్లు కొన్ని మన చుట్టూవున్న స్త్రీ పురుషులకు పేర్లుగా ఉన్నాయి. అవేవో రాయమనండి.
7. కిందితరగతుల్లో నేర్చుకొన్నవారాలు, నెలలు ఈపాఠంలోని నక్షత్రాలు, రాసులు, తర్వాతచెప్పే సంవత్సరాల పేర్లను ఎల్లప్పుడూ జ్ఞాపకముంచుకోవాలని చెప్పండి.
8. ప్రతిరోజూ ఆ రోజు ఏ నక్షత్రమో క్యాలండర్ చూచి చెప్తే మరీ మంచిది.
9. సూర్యుడు ఇతరరాసుల్లో ఏయే తేదీల మధ్య ఉదయిస్తాడో తెలపండి. రాయించండి.

---

**శీలం లేని సౌందర్యం తావిలేని పూవువంటిది**

---

0

# 13. మన నేల తల్లిని కాపాడుకొందాం

(పర్యావరణాన్ని కాపాడుకొంటేనే మనిషి మనుగడ సాధ్యమౌతుందని చెప్పడం ఈ పాఠం ఉద్దేశం.)

ఈ పాఠంలోని కొత్త పదాలు :

వేధించు, పర్యావరణం, ప్రధానం, శ్రద్ధవహించు, అసాధ్యం, రేణువు, వాయువు, క్రుళ్ళు, కలుషం, సహజం, అరికట్టు, వృక్షం, విచక్షణ, నరికివేయు, తరిగిపోవు, సమతౌల్యం, లోపించు, విషమపరిస్థితి, లోనగు, పరిణామం, వాతావరణం, పరిమితం, ప్రభావం, హరించు, అధికం, దోహదపడు, తీవ్రత, శీతోష్ణము, ఔషధం, నిత్యావసరం, సమకూర్చు, యోగ్యం.

* * *

ఈనాడు ప్రపంచాన్ని వేధిస్తున్న సమస్యల్లో పర్యావరణ సమస్య ప్రధానమైంది. పర్యావరణమంటే పరిసరాల వాతావరణం. ఈ పర్యావరణం పట్ల శ్రద్ధ వహించకుండా జీవించడం అసాధ్యమవుతున్న దశలోకి మానవులమంతా ప్రవేశిస్తున్నాం.

పొగ, ధూళిరేణువులు, విషవాయువులు, చెడువాసనలు, మలమూత్రాలు, రణగొణధ్వనులు, క్రుళ్ళిన పదార్థాలు మొదలైనవన్నీ మనం పీల్చే గాలినీ తద్వారా వాతావరణాన్నీ కలుషితం చేస్తున్నాయి. దీని వల్ల మన చుట్టూ ఉన్న గాలి తన సహజ లక్షణాలను కోల్పోతుంది. ఈ కాలుష్యాన్ని అరికట్టగలిగేః కేవలం వృక్షాలు మాత్రమే.




పరిశ్రమలు, వంటచెరుకు మొదలైన అవసరాల కోసం విచక్షణ లేకుండా చెట్లను నరికివేయడంవల్ల రాను రాను మన అటవీ సంపద తరిగిపోతోంది. దీనివల్ల వాతావరణంలో సమతౌల్యం లోపించి అనేక విషమ పరిస్థితులు ఎదురవుతున్నాయి. భూసారం తగ్గిపోవడం, భూమి కోతకు లోనవడం, వర్షపాతం తగ్గడం, వరదలు రావడం మొదలైనవన్నీ చెట్లు నరకడంవల్ల కలిగే పరిణామాలే.



మనం ఆరోగ్యంగా జీవించాలంటే కల్మషం లేని గాలి అవసరం. ఏ దేశం కూడా తన చుట్టూ ఉన్న వాతావరణాన్ని తనకే పరిమితం చేసుకోలేదు. నీరు కలుషితమైతే ఆ నీరు ఒకప్రదేశంపై నే ప్రభావంచూపుతుంది. కాని కలుషితమైన వాతావరణం ప్రపంచాన్నంతటినీ కలుషితంచేస్తుంది.

వృక్షాలు నీడను ఇవ్వడం మాత్రమే గాకుండా, గాలిలోని కాలుష్యాన్ని హరించి మనిషికి కావల్సిన మంచిగాలిని ఇస్తాయి. దట్టంగా, ఏపుగా పెరిగిన అడవులు భూమికోతనుతగ్గించి భూసారాన్ని పెంచుతాయి. అంతేగాక ఎడారుల విస్తరణను ఆపి అధికవర్షపాతానికి దోహదపడతాయి. గాలివేగాన్ని, తీవ్రతను కూడా తగ్గించి వాతావరణసమతౌల్యాన్ని కాపాడుతాయి. మనకు నిత్యావసరాలైన ఆహారం, ఔషధాలను సమకూరుస్తాయి. పరిసరాలను పచ్చగా అందంగా మారుస్తాయి.



మానవులంతా సుఖంగా జీవించాలంటే భూభాగంలోకనీసం మూడో

వం నా చెట్లతో నిండి ఉండాలి. వ్యవసాయానికి యోగ్యంకాని నేలల్లోనూ, రో కరువైపులా, పొలాలగట్లమీదా, వీలైన ప్రతిచోటా చెట్లను నాటాలి. నా న చెట్లను రక్షించి మనల్ని మనం రక్షించుకోవాలి. అందుకే అంటారు పెద్దలు ' వృక్షోరక్షతి రక్షితః ' అని.

బాలలూ ! మనం మన నేలతల్లిని కాపాడుకొందాం !

అభ్యాసవేదిక

1. ఈ కింది పదాలకు అర్థాలు చెప్పండి. రాయించండి.
వేధించు - బాధించు, ఇబ్బంది పెట్టు; పర్యావరణం - చుట్టూ ఉన్న వాతావరణం, ప్రధానం - ముఖ్యం, అసాధ్యం - సాధ్యముకానిది, ధూళి - దుమ్ము, రేణువు - చిన్నకణము, కలుషితం - మలినం, సహజం - పుట్టుకతో వచ్చిన, స్వభావసిద్ధం; విచక్షణ - మంచి చెడు అనే భావం, సమతౌల్యం - సమానమైన బరువు, పరిణామం - మార్పు, హరించు - లయంచేయు, తగ్గించు; విస్తరణ - వ్యాప్తి, అధికం - మిక్కిలి, ఎక్కువ, తోహదపడు - సహాయపడు, నిత్యావసరం - ప్రతిరోజు అవసరం, ఔషధం - మందు, సమకూర్చు - ఏర్పాటుచేయు, రక్షతి - కాపాడును, రక్షితః -కాపాడినవాడు, రక్షించు - కాపాడు; అరికట్టు - ఆపు, నిలుపుదలచేయు.

2. ఈ కింది ప్రశ్నలకు సమాధానాలు చెప్పించండి. రాయించండి.
(i) ప్రపంచాన్ని వేధిస్తున్న సమస్యల్లో ప్రధానమైందేది ? పర్యావరణమంటే ఏమిటి?
(ii) ప్రపంచాన్ని వేధిస్తున్న ఇతర సమస్యలేవి ?
(iii) మానవులంతా ఏ దశలోకి ప్రవేశిస్తున్నారు ?
(iv) పీల్చే గాలిని ఏ యే పదార్థాలు కలుషితం చేస్తున్నాయి ?
(v) కాలుష్యాన్ని అరికట్టగలిగే వేవి ?
(vi) మన అటవీ సంపద ఎందుకు తరిగిపోతోంది ?
(vii) చెట్లు నరకడంవల్ల కలిగే ఇతర పరిణామాలేమిటి ?
(viii) కలుషిత వాతావరణం ఏ ప్రాంతంపై ప్రభావం చూపుతుంది ?
(ix) వృక్షాలు మనిషికి ఎలా సాయం చేస్తాయి ?
(x) మానవులు సుఖంగా ఉండాలంటే ఏం చేయాలి ?
(xi) వృక్షోరక్షతి రక్షితః అంటే ఏమిటి ?
(xii) మనం ఎవరిని కాపాడుకోవాలి ?

3. ఈ కింది పదాలను సొంతవాక్యాల్లో చెప్పించండి. రాయించండి.
శ్రద్ధవహించు–సహజరక్షణం–అరికట్టు – తరిగిపోవు – విషమ పరిస్థితులు ఎదురగు – పరిణామం – పరిమితం చేసికొను – హరించు – దోహదపడు – సమకూర్చు.
4. ఈ కింది పదాల్లో గమనించిన అర్థాల మార్పులను వివరించండి. రాయించండి.
అసాధ్యం – సాధ్యం ప్రధానం – అప్రధానం
అయోగ్యం – యోగ్యం శ్రద్ధ – అశ్రద్ధ
చెడువాసన (దుర్వాసన) – మంచివాసన (సువాసన)
విషము – సమ అనారోగ్యం – ఆరోగ్యం
ఇట్లే మరికొన్ని పదాలను చెప్పండి.
5. ఈ కింది పదం చెందిన మార్పులను చెప్పండి.
కలుషితం – కాలుష్యం.
ఇట్టి మరో రెండు పదాలను చెప్పండి. రాయించండి.
6. ఈ కింది వాక్యాలలోని ఖాళీలను కింద ఇచ్చిన పదాలనుండి ఎంపికచేసి పూర్తిచేయించండి.

(i) కాలుష్యాన్ని అరికట్టగలిగేవి ________ వృక్షాలు మాత్రమే.
(ii) మనం ఆరోగ్యంగా జీవించాలంటే ________ లేని గాలి అవసరం.
(iii) కలుషితమైన ________ ప్రపంచాన్నంతటినీ ________ చేస్తుంది.
(iv) పరిసరాలను ________ అందంగా మారుస్తాయి.
(v) మనకు ________ ఆహారం, ఔషధాలను సమకూరుస్తాయి.

(నిత్యావసరాలైన, కేవలం, వాతావరణం, పచ్చగా, కలుషితం, కల్మషం)
7. మీ గ్రామం/పట్టణంలోని ఒక సమస్యను గూర్చి చెప్పి పది వాక్యాలు రాయించండి.
8. పాఠశాలలో ధ్వని కాలుష్యాన్ని తగ్గించే ఉపాయాలను విద్యార్థుల్ని అన్వేషించమనండి.
9. భూమి కోతకు లోనవడం, వరదలు రావడం మొదలైన వాటిగురించిన చిత్రాలు చూపండి. అందువల్ల కలిగే నష్టాలను వివరించండి.
10. చెట్లు పెంచాలి కాని నరకరాదని చెప్పండి. ప్రతి విద్యార్థిచే పాఠశాలలో ఒక చెట్టైనా నాటించి దాని పోషణాభారం వహించేట్లు చేయండి.
11. కలుషితమైన పదార్థాల మాదిర్లను చూపండి. అట్టి ఆహారాన్ని తినరాదని చెప్పండి.
12. తమ వంతుగా తాము వాతావరణాన్ని కలుషితం చేయరాదనే భావనను విద్యార్థుల్లో కలిగించండి.
13. తరగతి గదులు – పాఠశాల ఆవరణ శుభ్రంగా ఉంచాలని చెప్పండి.

**వృక్షో రక్షతి రక్షితః**

—— o ——

# 14. ఉపాయం

(ఉపాయంతో అపాయాన్ని తప్పించుకోవచ్చు అని చెప్పడమే ఈ పాఠం ఉద్దేశం.)

ఈ పాఠంలోని కొత్త పదాలు :

ఆరగించు, సంతు, వరుస, ఖేదం, గుణపాఠం, వేచియుండు, పూదోట, రాణివాసం, సంతసము, జలకమాడు, తరువు, అదను, నిబ్బరం, జారవిడచు, రెక్కలార్చు, పీడనిరుగు, కేకలు, వెన్నంటు, గునపం, తవ్విపోయు, బుస్సుబుస్సుమను, బడిసెలు, కాలం గడుపు.

* * *

అడవిలోన ఉన్నదొక్క పెద్ద మఱ్ఱిచెట్టు
చెట్టుపైన ఉంటుందో చిట్టిపొట్టి కాకి
చెట్టుకింది పుట్టలోన నివసించే పాము
గూటిలోన కాకిలేని సమయానికి వేచి
చెట్టు పాకి కాకి గుడ్ల నారగించు రోజూ.
నానాటికి కాకి సంతు నాశనమగుచుండె
ప్రతిదినమీ వరుసచూచి కాకి ఖేద మొందె.
పాము కొక్క గుణపాఠం చెప్పాలని కాకి
వేచియుండె ఒక చక్కని అవకాశం కోసం.
అడవి సమీపంబులోన ఉన్నదొక్క నగరు
ఆ పట్టణమేలువాడు అరివీరుడు రాజు
ఆ రాజుగారి కున్నదొక్క చక్కని పూదోట
తోట మధ్య స్నానాలకు సరస్సొకటి కలదు.
ఒక్కనాడు రాణివాసమంతగూడి సంతసమున
సరసిలోన జలకమాడ పూదోటకుతరలి వచ్చె.
మెడల్లోని రత్నహారములను తీసి గట్టు మీద
పెట్టివారు స్నానాలకు కొలను నీట దిగిపోయిరి.
దీని జూచె కాకి అచటి తరువు మీదినుండి
ఈ అదనులోన కాకి కొక్క ఉపాయంబు తట్టె.



పొంచి పొంచి పొంచి హారమొకటి ముక్కుకరచి
ఎగిరి వెళ్ళి పుట్టవున్న చెట్టు మీద వాలి
పుట్టలోన హారమ్మును నిబ్బరముగ జారవిడిచి
రెక్కలార్చి పాముపీడ విరుగుటకై వేచియుండె.
ఇదిచూచిన రాణులెల్ల హాహాయని అరచిరపుడు
కేకలు విని రాజభటులు కాకిని వెన్నంటినారు
వెన్నంటిన రాజభటులు కాకి పనిని చూచి
గునపాలతో పుట్టనంత తవ్విపోసినారు.
పుట్టలోని పాము బుస్సు బుస్సు మనుచు లేచె
భటులందరు ఆ పామును బడిసెలతో పొడిచిచంపి
దొరికిన ఆ హారమ్మును రాణులకందించినారు
ఉపాయంబు తోడ కాకి పామును చంపించివేసె
అపాయమ్ము తప్పిపోవ హాయిగ కాలం గడిపె.

(డా. డి. సాంబమూర్తి)

## అభ్యాసవేదిక

1. ఈ కింది పదాలకు అర్థాలు చెప్పండి. రాయించండి.
నివసించు – ఉండు, ఆరగించు – తిను, నాశనం – చేటు, నశించిపోవు; ఖేదం –దుఃఖం, సమీపం – దగ్గర, అరివీరుడు – శత్రువులకు శూరుడు, రాణివాసం – అంతఃపుర స్త్రీలు, సంతసం – ఆనందం, తరువు – చెట్టు, అదను – సమయం, నిబ్బరం – నిశ్చింత, గునపం – గడ్డపార, నగరు – పట్టణం.
2. ఈ కింది పదాలను సొంత వాక్యాల్లో చెప్పించండి. ఆ వాక్యాలు రాయించండి.
ఖేదమొందు – వేచియుండు – తరలివచ్చు – దిగిపోవు – జారవిడచు – రెక్కలార్చు – వెన్నంటు – తవ్విపోయు – చంపించివేయు – కాలంగడుపు.
3. పై పదాలు కొన్నిటిలో రెండేసి క్రియాపదాలున్నాయి. వీనిని గమనింపజేయండి. వానిని వేరుగా రాయించండి. ఉదా : దిగిపోవు – దిగు, పోవు.
4. ఈ కింది ప్రశ్నలకు సమాధానాలు చెప్పించండి. రాయించండి.
   (i) కాకి ఎక్కడ ఉండేది ?
   (ii) కాకికి ఎందుకు దుఃఖం కల్గింది ?
   (iii) కాకి ఎలాంటి అవకాశంకోసం చూసింది ?
   (iv) పూదోటకు ఎవరు వచ్చారు ?
   (v) రాణివాసం పూదోటకు రావటానికిగల కారణ మేమిటి ?
   (vi) పాము హారాన్ని ఏంచేసింది ?
   (vii) రాజభటులు ఏంచేశారు ?
   (viii) రాణులంతా ఎందుకు అరిచారు ?
   (ix) నిబ్బరంగా మనిషి ఎపుడుంటాడు ?
   (x) ఈ కథలోని నీతి ఏమిటి ?
5. ఇలాంటి మరో గేయకథను సేకరించమని విద్యార్థులకు చెప్పండి. ఈ గేయ కథను కంఠస్థం చేయించి హావభావయుక్తంగా, విద్యార్థులచే భినయింపజేయండి.
7. ఈ పాఠంలోని నామవాచక పదాలు, క్రియా పదాల ప క రాయమనండి.
8. కొన్ని కథాగేయాల చిత్రమాలికలను సేకరించి విద్యా లకు చూపండి – విద్యార్థుల్ని మరికొన్ని చిత్రమాలికలు సేకరించమనండి.వాని ఆధారంగా కథలు చెప్పించండి.

**ఐకమత్యమే మహాబలం**

—— o ——

# 15. లేఖలు

(నిత్యజీవితంలో అవసరమయే లేఖల్ని రాయడమెలాగో చెప్పడం ఈ పాఠం ఉద్దేశం.)

ఈ పాఠంలోని కొత్త పదాలు :

సలహా, మంజూరు, మన్నించు, విధేయుడు, గౌరవం, ఊరువిడుచు, తాత్కాలికము, నివాసం, కొనసాగించు, సమర్పించు, అనుమతి, ప్రార్థన, కృతజ్ఞతలు.

* * *

సెలవు చీటి

కావలి,

గౌరవనీయులైన తేది ------ 1994.

నాలుగో తరగతి ఉపాధ్యాయులు గారికి,

ప్రాథమిక పాఠశాల, కావలి.

అయ్యా,

ఈ రోజు జ్వరం రావడం వల్ల పాఠశాలకు రాలేక పోతున్నాను. మా అమ్మా, నాన్నా ఈ రోజు విశ్రాంతి తీసికొమ్మని సలహా ఇచ్చారు.

కావున దయతో ఒకరోజు సెలవు మంజూరు చేయవలసిందిగా ప్రార్థన.

నమస్కారాలు.

మీ విధేయుడు,

వినయబాబు

నంబరు - 12.

## అభ్యర్థన పత్రం




కావలి,
తేది - - - - - - - 1994.

గౌరవనీయులు
ప్రధానోపాధ్యాయులు గారికి,
ప్రాథమిక పాఠశాల, కావలి.

అయ్యా,

నేను ప్రస్తుతం కర్నూలు జిల్లాలోని ఆత్మకూరు ప్రాథమిక పాఠశాలలో నాలుగో తరగతి చదువుతున్నాను.

కొన్ని కారణాలవల్ల మా కుటుంబం ఆ ఊరు విడిచి వచ్చి ఈ గ్రామంలో తాత్కాలికంగా నివాసం ఉండవలసి వస్తున్నది. అందువల్ల మీ పాఠశాలలో నాలుగో తరగతిలో చేరి నా చదువును కొనసాగించ దలిచాను. ఇందువెంట ఆత్మకూరు పాఠశాల వారిచ్చిన రికార్డుషీటు సమర్పించుకొంటున్నాను.

దయతో నేను మీ పాఠశాలలోని నాలుగో తరగతిలో చదువుకోవడానికి తగిన ప్రవేశ అనుమతి ఇవ్వవలసిందిగ ప్రార్థిస్తున్నాను.

కృతజ్ఞతలు.

తమ విధేయుడు,
పేరు : వినయబాబు
తండ్రి పేరు : రమేశ్ చంద్ర
చిరునామా : ఇం.నెం. 6-7-30
కావలి, నెల్లూరు జిల్లా.

## అభ్యాసవేదిక

1. ఈ క్రింది పదాలకు అర్థాలు చెప్పించండి. రాయించండి.

   విశ్రాంతి-పనిలేకుండావుండుట, సమర్పించు - అందించు, అనుమతి-ఆజ్ఞ.

2. ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు చెప్పించండి. రాయించండి.

   (i) వినయబాబు ఎందువల్ల సెలవు కోరాడు ?

   (ii) వినయబాబు తల్లి, తండ్రి ఏమని అతనికి సలహా ఇచ్చారు ?

   (iii) వినయబాబు ఎందువల్ల మొదటి పాఠశాలను వదలి వచ్చాడు ?

   (iv) క్రొత్త పాఠశాలలో చేరడానికి ఏమి సమర్పించాలి ?

   (v) సాధారణంగా ఏ కారణాలవల్ల ఊరు వదలి వస్తారు ?

3. ఈ క్రింది కృత్యాలను విద్యార్థులచే చేయించండి.

   (i) మొదటి సెలవుచీటీ ఆధారంగా వేరువేరు కారణాలపై కనీసం (5) నమూనా సెలవుచీటీలను రాయించండి.

   (ii) రెండవ అభ్యర్థన పత్రం ఆధారంగా మరో రెండు అభ్యర్థన పత్రాలు రాయించండి. ఇతర కారణాలు చెప్పండి.

   (iii) విద్యార్థుల తలిదండ్రులకు వచ్చిన పాతలేఖల్ని సేకరించమనండి. వానిని చదివించండి.పాఠశాలలో విద్యార్థులు వ్రాసేసెలవు చీటీలనన్నింటిని సేకరించి చదివించండి.

4. ఈ క్రింది పదాలవంటి మరికొన్ని పదాలు సేకరించి రాయమనండి.

   తాత్కాలికము - శాశ్వతము.

5. నమస్కారాలు, కృతజ్ఞతలు చెప్పాల్సిన సందర్భాలను చెప్పండి. విద్యార్థులు నిత్యజీవితంలో ఈ పదాలను ఆయా సందర్భాల్లో ఉపయోగించేట్లు చూడండి.

---

**జ్ఞానంకన్న శీలమే మిన్న**

---

— o —

# 16. వార్తా పత్రిక

(లోకజ్ఞానం కోసం పత్రికలు చదవాలనే అలవాటును పెంపొందించడం ఈ పాఠం ఉద్దేశం.)

ఈ పాఠంలోని కొత్త పదాలు :

పలుకరించు, విశేషాలు, పూసగ్రుచ్చు, విసుగుకొను, తెలివితేటలు, నైపుణ్యం, సంపాదకుడు, కార్యాలయము, ఎంపికచేయు, ప్రచురణ, నోచుకొను, విలేకరులు, సేకరించు, కృషి అడుగుపెట్టు, వెలువడు, పక్షం, జనజీవనం, లోకజ్ఞానం, అలరించు, ఆదరించు.

* * *

ప్రతిరోజూ తెల్లవారేప్పటికే మీ యింటికి వచ్చి పలుకరించేదెవరో మీకు తెలుసా ! నేనే ! వార్తా పత్రికను. ప్రపంచం నలుమూలలా జరిగిన విశేషాలన్నిటినీ పూసగ్రుచ్చినట్లు మీకు తెలియజేసే నాకోసం ప్రతిరోజూ ఉదయమే మీరంతా ఎదురుచూస్తుంటారు. ఆలస్యమైతే ఇంకా పేపరు రాలేదా అని విసుక్కుంటారు కూడా. ఒక్కొక్కరోజు ఈ పత్రికలో విశేషాలేవీ లేవే అని కూడా అనుకుంటారు.



నేను మీ ముందుకు రావటానికి గొప్ప తెలివితేటలు నైపుణ్యం ఉన్న ఎంతోమంది స్త్రీ, పురుషులు కారణం. నాకొక సంపాదకుడు, ఆయనతో పాటు కొంతమంది ఉప సంపాదకులు ఉంటారు. నా కార్యాలయానికి వచ్చిన వార్తలను వడబోసి ప్రచురణకు యోగ్యమైనవాటిని ఎంపిక చేస్తారు. వీరికి ఇంకా మరెందరో సాయపడతారు. అప్పుడే నేను అచ్చుకు నోచుకుంటాను.

నాలో ప్రచురించే వార్తలను విలేకరులు సేకరిస్తారు. వారేగాక కొన్ని వార్తా సంస్థలు కూడా వార్తలను సేకరించి పత్రికలకు అందజేస్తాయి. వారంతా టెలిఫోన్, టెలిగ్రాఫ్, టెలిప్రింటర్ మొదలైన సాధనాలద్వారా వార్తలను నా ప్రధాన కార్యాలయానికి పంపిస్తారు. ఇలా ఎంతోమంది కృషి వల్లే నేను ముస్తాబవుతున్నాను.




నేను మొదట జర్మనీదేశంలో పుట్టినట్లుగా చెపుతారు. నేనీ దేశంలో మొదట ' బెంగాల్ గజిట్ ' అనే పేరుతో అడుగుపెట్టాను. తెలుగులో మొదట ' ఆంధ్రపత్రిక ' అనే పేరుతో వెలువడ్డాను. ఇప్పుడు నేను ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి, ఈనాడు, ఉదయం, ఆంధ్రభూమి, విశాలాంధ్ర మొదలైన పేర్లతో కూడా వెలువడుతున్నాను.

నన్ను ప్రచురించే కాలాన్నిబట్టి దిన, వార, పక్ష, మాస పత్రికలుగా నేను వెలువడుతుంటాను. కేవలం వార్తలేకాక శాస్త్ర, సాహిత్య, కళారంగాలకు, జనజీవనానికి సంబంధించిన వివిధ అంశాలు నాతో మీ ముందుకు వస్తాయి. ఇలా మీ అందరికీ లోకజ్ఞానాన్ని కలిగిస్తూ అలరించే నన్ను ఆదరిస్తారుకదూ!

## అభ్యాసవేదిక

1. ఈ కింది పదాలకు అర్థాలు చెప్పండి. రాయించండి.

   పలుకరించు - మాట్లాడు, పూసగ్రుచ్చు - ఉన్నది ఉన్నట్లు చెప్పు, నైపుణ్యం - సామర్థ్యం, కార్యాలయం - పనిచోటు, ఆఫీసు; ప్రధానకార్యాలయం - ముఖ్యమైన పనిచోటు, వెలువడు - ప్రచురింపబడు, ప్రచురించు, ముద్రించు; లోకజ్ఞానం - ప్రపంచమునకు సంబంధించిన విషయాలు తెలియడం, అలరించు - ఆనందింపజేయు, ఆదరించు - గౌరవించు, సేకరించు - జమచేయు, కూడబెట్టు; ముస్తాబు - అలంకరణ.

2. ఈ కింది పదాలను సొంత వాక్యాల్లో ఉపయోగించమనండి. ఆ వాక్యాలను రాయించండి.

   పలుకరించు - పూసగ్రుచ్చు - ఎదురుచూచు - విసుక్కోను - తెలివితేటలు - వడపోయు - సాయపడు - అచ్చుకునోచుకోను - సేకరించు - ముస్తాబగు - ముందుకు వచ్చు - అలరించు.

3. ఈ కింది ప్రశ్నలకు సమాధానాలు చెప్పించి రాయించండి.

   (i) ప్రజలు వార్తాపత్రికకోరకు ఎందుకు ఎదురుచూస్తారు ?

   (ii) వార్తాపత్రిక వెలువడడానికి ఎవరెవరు కారకులు ?

   (iii) ఎవరి కృషితో వార్తాపత్రిక ముస్తాబవుతుంది ?

   (iv) బెంగాల్ గజెట్ - ఆంధ్రపత్రిక మొదట ఎచట పుట్టాయి ?

   (v) వార్తలతోబాటు పత్రికల్లో ఏయే అంశాలుంటాయి ?

4. ఈ కింది పదబంధాలు పరిశీలించమనండి. మరికొన్ని సేకరించమనండి.

   స్త్రీ పురుషులు - తెలివితేటలు

5. పత్రికలేగాక తెల్లవారగనే పలుకరించే మరికొందరెవరో తెలపండి. వారి గురించి పదేసి వాక్యాలు రాయమనండి.

6. స్థానికంగా దొరికే వివిధ పత్రికలు (పాతవైనాసరే) తరగతికి తెచ్చి చూపించండి. వానిని విద్యార్థుల విరామకాలంలో చదివించండి. దాతలనుండి పత్రికలను సేకరించమనండి.
7. ఏవేని ఐదు పత్రికలపేర్లు, వాని సంపాదకుల పేర్లను పట్టికగా రాయించండి.
8. విద్యార్థులలో పత్రికలను చదివే అలవాటును పెంపొందించుటకు తగిన సూచనలీయండి.
9. ఈ పాఠంలోని క్రియాపదాలను – నామవాచక పదాలను పట్టికగా రాయించండి.
10. బాలలూ ! ఈ కింది వాక్యాల జంటలను గమనించండి.

(i) రాముడు దశరథుని కుమారుడు.
రాముడు ఎవరి కుమారుడు ?

(ii) రాముడు అడవికి వెళ్ళెను.
రాముడు ఎచటికి వెళ్ళెను ?

(iii) రమేశ్ ఈ సాయంత్రం వస్తానన్నాడు.
రమేశ్ ఎప్పుడు వస్తానన్నాడు ?

పైన ఉన్న మూడు జంటవాక్యాల్లో మొదటివాక్యం సాధారణ వాక్యం. రెండోవాక్యం ప్రశ్నవాక్యం. సాధారణ వాక్యం ప్రశ్నవాక్యంగా మారుతున్నపుడు ఏం మార్పు జరిగిందో గమనించారా ?

1 వ-జంటలో దశరథుని అనే పదం బదులుగా ఎవరి అనే పదం
2 వ జంటలో అడవికి అనే పదం బదులుగా ఎచటికి అనే పదం
3 వ జంటలో ఈ సాయ అనే పదం బదులుగా ఎప్పుడు అనే పదం చోటు చేసికొన్నాయి.

ఇట్లే విద్యార్థులచే మరికొన్ని సాధారణవాక్యాలు ప్రశ్నవాక్యాలుగా ఎలా మారుతాయో చెప్పించండి. రాయించండి.

13. ఈ పాఠంలో వార్తాపత్రిక తన కథను తానే చెప్పింది. ఇలా చెప్పటాన్ని ఆత్మకథ అంటారు. ప్రతి వస్తువుకూ, ప్రతివ్యక్తికీ ఆత్మకథ ఉంటుంది. ఈ కిందివానిపై కనీసం పదేసి వాక్యాలు ఆత్మకథ రూపంలో రాయమనండి.
'నేను' – (విద్యార్థి ఆత్మకథ) రేడియో, టెలివిజన్ మొదలైనవి.

అభ్యాసం కూసువిద్య

—— 0 ——

# 17. ప్రపంచ బాలలగీతి

(ప్రపంచంలోని ప్రజలంతా ఒకటే అనే సమైక్యతా భావనని పెంపొందించడం ఈ పాఠం ఉద్దేశం.)

**ఈ పాఠంలోని కొత్త పదాలు :**

కల్ల, వన్నె, ముచ్చటగొలుపు, శాకాహారం, మాంసాహారం, పలువిధాలు, సందేశం, పకపకలాడు, సకలం.

* * *

ఎల్లలెరుగని వాళ్ళము - కల్లలెరుగని వాళ్ళము
బాలలం మేమొక్కటే - లోకమూ మాకొక్కటే.
గోధుమ రంగున కొందరు - పసుపువన్నె ఇంకొందరు
తెలుపు, నలుపు, ఆపిల్ ఎరుపూ - ఏ రంగైనా ముచ్చట గొలుపూ
రంగేదైనా, రూపేదైనా - నివసించే ఆ చోటేదైనా
బాలలం మేమొక్కటే - లోకమూ మాకొక్కటే.



అన్నం, పప్పూ, చారూ, కూరా - శాకాహారం అనువారైతే
గుడ్డూ, చేపా, కోడికూరా - మాంసాహారం అనువారైతే
తిండేదైనా, తీరేదైనా - తినగోరే ఆ రుచులేవైనా
బాలలం మేమొక్కటే - లోకమూ మాకొక్కటే.

అవునందురు,ఎస్ అందురు కొందరు - ఓకే, టాటా అందురు కొందరు
సీ, దేఖో, జా అంటూ కొందరు - పలువిధాలుగా పలుకుచుందురు
మాటేదైనా, పాటేదైనా - పెదాలు కలిపే భాషేదైనా
బాలలం మేమొక్కటే - లోకమూ మాకొక్కటే.
దేశాల్ వేర్వేరైనా కానీ - సందేశం మాదిదే యిదే
సంతోషంతో సకల ప్రపంచం - పకపకలాడాలన్నదే.

(*UNICEF* బాలలగీతి - అనువాదం - సుధామ)

అభ్యాసవేదిక

1. ఈ కింది పదాలకు అర్థాలు చెప్పండి. రాయించండి.
   కల్ల - అబద్ధం, శాకాహారం - కూరగాయల ఆహారం, సందేశం - సమాచారం, పంపేవార్త.
2. ఈ గేయాన్ని విద్యార్థులచే సామూహికంగా పాడించండి.
3. ఇలాంటి మరికొన్ని గేయాలు సేకరించండి - విద్యార్థులకు చెప్పి పాడించండి.
4. ఈ గేయాన్ని కంఠస్థంచేయమనండి.
5. ప్రపంచంలోని బాలలందరూ ఒక్కటే అనే ఈ సమైక్యతాగీతం బాలల ప్రవర్తనల్లో మార్పును కొనితేవాలి. అందులకు ప్రయత్నించండి.
6. ఐక్యరాజ్యసమితి పక్షాన జరిగే వివిధ ఉత్సవాల రోజుల్లో ఈ గేయాన్ని పాడించండి.
7. ఈ గేయంలోని ఇతర భాషా పదాలను పరిచయం చేయండి. ఇంతకు ముందు పాఠాల్లోని ఇతర భాషా పదాలను, వీనిని ఒకచోట చేర్చి పట్టికగా రాయమనండి.

---

సర్వేజనాః సుఖినోభవంతు

---

# 18. సుభాషితరత్నాలు

(కంఠస్థం చేయవలసినవి)

(జీవితంలో నైతిక విలువల ప్రాధాన్యాన్ని చెప్పడం, పాటించేట్లు చూడటం ఈ పాఠం ఉద్దేశం.)

ఈ పాఠంలోని కొత్త పదాలు :

హరి, సిరి, ఏతెంచు, మకరి, శిక్షించు, దయ, పరమేష్ఠి సురలు, పొగడు, కరి, కాచు, కమలాప్తుడు, రశ్మి, సోకు, కమలు, భంగి, నెలవు, తథ్యము, అర్చన, మర్మం, దుర్మార్గులు, చెంత, దూరుట, ఇల, దుష్కర్మలు, నిర్మలమతి, లెస్స, ఫణి, వెలయు, వృశ్చికం, ఖలుడు, గుఱుతు, పరిమళం, విత్తము.

* * *

హరి ! నీవె దిక్కు నాకును,
సిరితో ఏతెంచి మకరి శిక్షించి దయన్
పరమేష్ఠి సురలు పొగడగ
కరి గాచిన రీతి నన్ను కావుము కృష్ణా ! (1)

కమలములు నీట బాసిన
కమలాప్తుని రశ్మిసోకి కమలినభంగిన్
తమ తమ నెలవులు తప్పిన
తమ మిత్రులు శత్రులౌట తథ్యము సుమతీ ! (2)

తలనుండు విషము ఫణికిని
వెలయంగా తోక నుండు వృశ్చికమునకున్
తల తోక యనక యుండును
ఖలునకు నిలువెల్ల విషము గదరా సుమతీ ! (3)

నరుడు మెచ్చెనేని నారాయణుడు మెచ్చు
దీనులందు దేవదేవు డుండు;
మానవార్చనంబె మాధవార్చనమురా,
లలిత సుగుణజాల ! తెలుగుబాల ! (4)



తనకు తగని పిచ్చిపనులకు పోనేల ?
అడుసు త్రొక్కి కాలు కడుగ నేల ?
కోతి మేకు పీకి కోల్పోయె ప్రాణాలు;
లలిత సుగుణజాల ! తెలుగుబాల ! (5).

మర్మము పరులకు తెలుపకు,
దుర్మార్గుల చెంత నెపుడు దూరకు, ఖిల దు
ష్కర్మముల చేయనొల్లకు
నిర్మల మతి నుంట లెస్స, నిజము కుమారా ! (6)

పట్టు పట్టరాదు, పట్టి విడువరాదు,
పట్టెనేని బిగియ పట్టవలయు,
పట్టువిడుట కన్న పరగ చచ్చుట మేలు;
విశ్వదాభిరామ, వినురవేమ ! (7)

గురుని శిక్షలేక గుఱుతెట్లు కల్గునో
అర్జునికైనవాని యబ్బకైన
తాళపుఁజెవిలేక తలుపెట్టులూడునో
విశ్వదాభిరామ, వినురవేమ ! (8)

కస్తురి నటుచూడ గాంతి నల్లగనుండు
పరిమళించు దాని పరిమళంబు
గురువులైన వారిగుణము లీలాగురా
విశ్వదాభిరామ, వినురవేమ ! (9)

విద్య లేక యున్న విత్తములేకున్న
మూఢుఁడైనఁదుదకు మూఁగయైన
ఇష్టబంధువైనఁ కష్టమే కలుగును
విశ్వదాభిరామ, వినురవేమ ! (10)

### అభ్యాసవేదిక

I. ఈ కింది పదాలకు అర్థాలు చెప్పండి. రాయించండి.

1. హరి – విష్ణువు, సిరి – లక్ష్మీదేవి; ఏతెంచు – వచ్చు, మకరి – మొసలి; పరమేష్ఠి – బ్రహ్మ, సురలు – దేవతలు, పొగడు – కీర్తించు. కరి – ఏనుగు,
2. కమల + ఆప్తుడు = కమలాప్తుడు = పద్మములను వికసింపజేసే సూర్యుడు; రశ్మిసోకి – కాంతి తగిలి, కమలు – వాడిపోవు, భంగి – వలె, నెలవులు – స్థానాలు, తథ్యము – నిజం.

3. ఫణి - పాము, వృశ్చికం - తేలు, ఖలుడు - చెడ్డవాడు.

4. నరుడు - మానవుడు, అర్చన - పూజ.

5. అడుసు - బురద.

6. మర్మము - రహస్యం, పదులు - ఇతరులు; దుర్మార్గులు - చెడ్డవారు; దూరుట - దరిచేరుట, ఇల - లోకమున, దుష్కర్మములు - చెడ్డ పనులు, ఒల్లకు - ఇష్టపడకుము, నిర్మలమతి - మంచి మనస్సు, కొన్న - బాగు.

7. పరగ - ఒప్పుగా, బిగియపట్టుట - గట్టిగా పట్టుట.

8. గుఱుతు = జ్ఞానం, అజుడు = బ్రహ్మ

9. పరిమళం = సువాసన

10. విత్తము = సంపద

II. ప్రతి పద్యంలోని నీతిని విద్యార్థులకు వివరించిచెప్పి, వారిచేత చెప్పించాలి. ఉదా: 5 వ పద్యంలోని "కోతి-మేకు" కథ చెప్పి, వారిచేత కూడా చెప్పించాలి.

III. పైపది పద్యాలను కంఠస్థం చేయించండి.

IV. పై పద్యాలలో

(i) 1వ పద్యం : కృష్ణశతకంలోది. ఈ శతకాన్ని రాసినవారు 'నరసింహకవి'

(ii) 2, 3, పద్యాలు : సుమతి శతకంలోవి. ఈ శతకాన్ని రాసినవారు 'బద్దెన'

(iii) 4, 5 పద్యాలు : 'తెలుగుబాల' శతకంలోవి. ఈ శతకాన్ని రాసినవారు 'కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి'.
లలిత సుగుణజాల ! తెలుగుబాల ! - మృదువైన మంచి లక్షణములనేకమున్న ఓ తెలుగుబిడ్డ !

(iv) 6వ పద్యం : 'కుమారశతకం' లోది. దీన్ని రాసినవారు 'పక్కి అప్పలనరసయ్య'

(v) 7, 8, 9, 10 పద్యాలు : వేమనశతకంలోవి ఈ శతకాన్ని రాసినవారు 'వేమన- '

విశ్వద + అభిరామ ! వినురవేమ ! = 'ప్రపంచాన్ని ప్రసాదించిన పరమాత్మవల్ల మనోజ్ఞమైనవాడా ఓ వేమయ్యా, విను !' అని వేమన తన్ను తాను ప్రబోధించుకున్నట్లు లోకులకు నీతులను ఉపదేశించాడు.

V. ఈ పద్యాలకు చిన్న చిన్న వాక్యాల్లో భావాన్ని చెప్పండి. రాయించండి.

VI. విద్యార్థుల్ని ఈ శతకాలను సంపాదించి మరిన్ని పద్యాలు చదవమనండి. కంఠస్థం చేయమనండి.

# 19. మాటనేర్పు

(మాటలు జాగ్రత్తగా మాట్లాడాలని చెప్పడం ఈ పాఠం ఉద్దేశం.)

**ఈ పాఠంలోని కొత్త పదాలు :**

వాక్కు, పదను, వాడి, శబ్దములు, ఉబుకజేయు, అణిగియుండు, ప్రతిభ, మాన్యుడు, గాయం, వోలె, సౌమ్యం, సంతాపం, చూరగొను, ఎడద, తాళబద్ధం, ధ్వని, పురికొల్పు, మహిమ, పరవశించు, మరణభయం, మితం, హితం, ఋతము, మేధావి, పాటించు, అక్షరము, జగతి.

* * *

వాక్కుకున్న పదను వాడి కత్తికి లేదు
మార్చగలదు మాట మనిషి మనసు
జారవలదు నోరు జాగ్రత్త జాగ్రత్త
శబ్దములకు గొప్ప శక్తి కలదు. 1

ఉబుకజేయు ఉక్కు ఉత్సాహ వాక్యమ్ము
యువకులందు అణగియుండు ప్రతిభ
మాట మంచితనము మర్యాద గొనితెచ్చు
మాట వలన మనిషి మాన్యుడగును. 2

మంచిమాట చాలు మనసులోగాయమ్ము
మాన్పజాలు గొప్ప మందువోలె
సౌమ్యమైన మాట సంతాపమును బాపు
మాట చూరగొనును మనిషి యెడద. 3

తాళబద్ధమైన ధ్వని చాలు పురికొల్ప
మంత్ర మహిమలేల ? మాటలేల !
కదను త్రొక్కు సేన కదన రంగము చేరు
పరవశించి మరణ భయము వీడి. 4

మిత హిత ఋత వాక్కు మేధావి పాటించు
వాక్కు కూర్పు వేద ఋక్కులగును
మనిషి చచ్చిపోవు ! మాట చావక నిల్చు
అక్షరములు జగతి అక్షరములు. 5

*(డా. నండూరి రామకృష్ణమాచార్యులుగారి ప్రగతిగీతనుండి)*

## అభ్యాసవేదిక

1. ఈ కింది పదాలకు అ  లు చెప్పండి. రాయించండి.
   వాక్కు - మాట, శ ం - ధ్వని, ఉబుకచేయు - ప్రోత్సాహపరచు, ఉప్పొంగు, మాన్యుడు - గౌర నీయుడు, పూజనీయుడు; సౌమ్యం - మెత్తని, సుకుమారం; సంతాపం - దుఃఖం, చూరగొను - ఆకట్టుకొను, పురికొల్పు - ప్రోత్సాహపరచు, కదను - యుద్ధం, మితము - కొద్ది, హితము - మంచి, ఋతము - సత్యమైనది, మేధావి - జ్ఞాని, ఋక్కు - ఛందోబద్ధమైన వేదమంత్రము, అక్షరము - క్షరముకానిది, నాశనం లేనిది.

2. ఈ పద్యాలను కంఠస్థం చేయించండి.

3. ఈ పద్యాలకు తాత్పర్యం చెప్పి చిన్న చిన్న వాక్యాల్లో రాయించండి.
   ఉదా : ఒకటో పద్యం : మాటకున్న శక్తి కత్తికి లేదు.
   మాట మనిషి మనసును మారుస్తుంది.
   మాటలు జాగ్రత్తగా మాట్లాడాలి.
   ఎందుకంటె మాటలకున్న శక్తి చాలా గొప్పది.

   ఇట్లే అన్ని పద్యాలకు చెప్పండి. రాయించండి.

**నోరు మంచిదైతే ఊరు మంచి దౌతుంది**

—— o ——

# పద పట్టిక

ఎదిరించు (1)
ఎల్లలు (17)

**ఏ**

ఏకైక (5)
ఏతెంచు (18)

**ఐ**

ఐకమత్యం (14)
ఐక్యపథం (1)

**ఒ**

ఒడి (8)

**ఔ**

ఔషధం (13)

**క**

కంఠం (8)
కఠినచిత్తుడు (11)
కత్తిమీదసాము (5)
కదనం (17)
కదను (19)
కదనరంగం (19)
కన్నులపండుగ (11)
కమలాప్తుడు (18)
కములు (18)
కరి (18)
క్రరి (8)
కలుషితం (13)
కల్మషం (13)
కల్లలు (17)
కళకళలాడు (3)
కాచు (18)
కాపరి (2)
కాపాడు (1)
కాయకష్టం (6)
కార్యం (10)
కార్యాలయం (9,16)
కాలుడు (17)
కాలుష్యం (13)
కాళ్ళావేళ్ళాపడు (4)
కుదుటపడు (5)
కుదువ (17)
కులదైవం (11)
కూడబెట్టు (3)
కూసువిద్య (16)
కృతజ్ఞతలు (15)
కృషి (16)
కృషిచేయు (6)
కేవలం (13)
కొండగుహ (2)
కొనసాగించు (15)
కొలను (14)
కొల్లాయి (10)
క్రమశిక్షణ (6)

**ఖ**

ఖండించు (6)
ఖలుడు (18)
ఖరీదైన (10)
ఖేదము (14)

**గ**

గంభీరము (2)
గట్టు (4)
గట్లనొరిసి (4)
గడ్డికరచు (8)
గణతంత్రదినోత్సవం(4)
గద్దించు (2)
గమనించు (2)
గర్వాంధుడు (8)
గరీయసి (1)
గిరిజనులు (8)
గుండెలవియు (4)
గుఱుతు (18)
గుబగుబలు (2)
గుణపాఠం (14)
గుప్పిట్లో పెట్టుకొను (2)
గురవుట (6)

**ఘ**

ఘనంగా (11)

**చ**

చనువు (7)
చర (4)
చిత్తశుద్ధి (6)
చిరునవ్వు (3)
చిరునామా (9)

నివాసం (15)
నివాసస్థలం (2)
నివ్వెరపోవు (5)
నిశితం (7)
నృత్యాలు (11)
నెరవేరు (3)
నెలవు (18)
నైపుణ్యం (16)
నొక్కిపట్టు (8)
నోచుకొను (16)
నౌకరి (5)
ప
పకపకలాడు (17)
పడక (3)
పతాకం (1)
పథకం (9)
పదను (19)
పయనించు (1)
పరమధర్మం (7)
పరమావధి (7)
పరమేష్ఠి (18)
పరవశించు (19)
పర్యావరణం (13)
పరిణామం (13)
పరిమళం (18)
పరిమితం (13)
పరిశీలించుట (7)
పరిష్కారం (11)

పరుగుతీయు (4)
పరుగెత్తు (3)
పలుకుబడి (2)
పలువిధాలు (17)
పసిడి (3)
పసిడిపూలు (3)
పశ్చాత్తాపం (8)
పక్షం (16)
పాటించు (19)
పాలుపడు (6)
పాదరసం (4)
పానీయం (3)
పీడ (2)
పునర్వివాహం (6)
పురికొల్పు (19)
పుష్పాలు (3)
పూదోట (14)
పూనుకొను (6)
పూసగ్రుచ్చినట్లు (16)
పెంపొందించు (7)
పెరేడ్ (4)
పొదుపు (9)
పొగడు (18)
పోగవు (4)
ప్రగతిపథం (1)
ప్రచురణ (16)
ప్రజానురంజనం (7)
ప్రజాస్వామ్యం (1)

ప్రజాశ్రేయస్సు (17)
ప్రతిజ్ఞ (2)
ప్రతిభ (7,19)
ప్రత్యక్షం (3)
ప్రత్యేకం (11)
ప్రథమ చికిత్స
ప్రథముడు (6)
ప్రదర్శించు (4)
ప్రధానం (13)
ప్రబోధించు (6)
ప్రభావం (13)
ప్రభుత్వ ఉద్యోగి (5)
ప్రమాదం (4,5)
ప్రముఖులు (5)
ప్రయోజనం (6)
ప్రవాహవేగం (4)
ప్రసిద్ధి (11)
ప్రస్తుతం (15)
ప్రశంస (4)
ప్రశ్నించు (3)
ప్రాతఃస్మరణీయురాలు (7)
ప్రాధాన్యత (6)
ఫ
ఫణి (18)
ఫలించు (10)
బ
బారినపడు (6)

# అంటరానితనం అమానుషం



మీ కుటుంబ సౌఖ్యానికి



అమ్మాయి చదువు ముఖ్యం





కంటిచూపుక

ఆకు కూరలు తినండి




మీ పిల్లలకు
టీకాలు
వేయించండి

రోగాలనుండి
కాపాడండి



ఆంధ్ర ప్రదేశ ప్రభుత్వ పాఠ్యగ్రంథముల ముద్రణాలయమున
ముద్రితము, హైదరాబాదు.